# శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారి కాలజ్ఞానము

నివేదన

ఈ గ్రంథంలో మీకు ఏదైనా బాగుందనిపిస్తే అది నా గురుదేవుల అనుగ్రహం. తక్కిన దోషాలన్నీ నావి. చేతగానితనమంతా నాది.

విజ్ఞప్తి

నేను నాస్తికుణ్ణి కాదు. మతద్వేషిని అంతకంటే కాదు. నా గ్రంథం "2012 కలియుగాంతం కాదు...మరి ఎప్పుడు???/ఈ వెబ్_సైట్ లో పొందుపరిచిన 'కాలజ్ఞాన' విశేషములకు భాష్యము రాగద్వేషాలకు అతీతంగా వ్రాయటం జరిగింది. ప్రజలను భయభ్రాంతులను చేయటానికో, సంచలనములకోసమో, కీర్తిప్రతిష్టల కోసమో వ్రాయలేదు. రాగద్వేషాలకు లోను కాకుండా సత్యానిర్ణయ దృష్టితో చదివే చదువరులందరికీ ఈ గ్రంథం ద్వారా కలియుగాంతం అవడానికి దోహదపడే అంశాలు, భగవంతుడి తుది హెచ్చరికలు, కొందరి ఆధిపత్య ధోరణివల్ల ఈ దేశసమగ్రత, దేశభద్రత ఎలా పెనుప్రమాదంలో పడి ఈ దేశంలో అంతర్యుద్ధం తలెత్తటంవల్లనూ, ఆ తరువాత మూడవప్రపంచ యుద్ధంలో పాల్గొని వంద కోట్లపైబడి జనాభాను కోల్పోబోతుందో తెలుస్తాయని ఆశిస్తున్నా. అలాచదువుతారు కదూ...

ఆధారం

ఈ రచనకు ఆధారం, శ్రీశైలంలో వున్న నా గురుదేవులైన శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారు, శ్రీశ్రీశ్రీ ఆచార్యా నాగార్జునులవారు, శ్రీశ్రీశ్రీ స్వర్ణ అమరలింగేశ్వరులవారు, శ్రీశ్రీశ్రీ భార్గవరాముల వారి సమకాలికులైన మరో ఇద్దరి వద్ద చదువుకున్న ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము, ప్రణవవేదము; నేను తెలుసుకున్న విషయములు, వారివద్ద చూసిన శ్రీశ్రీశ్రీ బ్రహ్మంగారి కాలజ్ఞాన తాళప్రతులు. (గురుదేవులవద్ద వున్న ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము, ప్రణవవేదము, తదితరములు ముద్రణకు వెళుతున్నాయి. ప్రముఖ దేవాలయములకు, గ్రంథాలయములకు, విశ్వవిద్యాలయములకు ఉచితంగా పంపిణీ జరుగుతుంది) ఆవిష్కరణ శ్రీశ్రీశ్రీ వీరభోగవసంతరాయలవారి సమక్షంలో జరుగుతుంది

ఓం గాయత్రీవిశ్వకర్మణే నమ:

శ్రీశ్రీశ్రీశ్రీ వీరభోగవసంతరాయల వారిచే
09-09-09 నాటి నుండే దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ ప్రారంభం

శ్రీశ్రీశ్రీశ్రీ వీరభోగవసంతరాయలవారు
తేది.26-12-2011 నాడు పట్టాభిషిక్తులైనారు

2012 కలియుగాంతం కాదు.......మరి ఎప్పుడు ?????

ఈ సర్వజగత్తుకు సృష్టికర్త అయిన విశ్వకర్మను వేదపితగాను, ఆయన భార్య గాయత్రీదేవిని వేదమాతగాను వేదములు కీర్తించినవి. వారి పుత్రులైన (1)మనుబ్రహ్మ(శివుడు), (2)మయబ్రహ్మ(విష్ణువు) (3)త్వష్ట్రృబ్రహ్మ(బ్రహ్మ), (4)శిల్పిబ్రహ్మ(ఇంద్రుడు), (5)విశ్వజ్ఞబ్రహ్మ (సూర్యుడు)లు పంచబ్రహ్మలుగా పేరుగాంచినారు.

పంచముఖ విశ్వకర్మ యొక్క
సద్యోజాత(తూర్పు)ముఖమునుండి మనుబ్రహ్మ రూపమున సానగబ్రహ్మర్షి,
వామదేవ(దక్షిణ)ముఖమునుండి మయబ్రహ్మ రూపమున సనాతనబ్రహ్మర్షి,
అఘోర(పశ్చిమ)ముఖమునుండి త్వష్టృబ్రహ్మ రూపమున అహభువనసబ్రహ్మర్షి,
తత్పురుష(ఉత్తర)ముఖమునుండి శిల్పిబ్రహ్మ రూపమున ప్రత్నసబ్రహ్మర్షి,

ఈశాన(ఊర్ధ్వ)ముఖమునుండి విశ్వజ్ఞబ్రహ్మ రూపమున సుపర్ణసబ్రహ్మర్షి ఉద్భవించినారు.

సానగబ్రహ్మర్షి, సనాతనబ్రహ్మర్షి, అహభువనసబ్రహ్మర్షి, ప్రత్నసబ్రహ్మర్షి, సుపర్ణసబ్రహ్మర్షులు పంచర్షులు/పంచఋషులు/పంచబ్రహ్మర్షులు గానూ;
మనుబ్రహ్మ, మయబ్రహ్మ, త్వష్టృబ్రహ్మ, శిల్పిబ్రహ్మ, విశ్వజ్ఞబ్రహ్మలు పంచబ్రహ్మలుగానూ కీర్తించబడినారు.

ఆదిశక్తి సమేతుడైన మనుబ్రహ్మను పార్వతీ సమేతుడైన శివుడిగానూ,
పరాశక్తి సమేతుడైన మయబ్రహ్మను లక్ష్మీ సమేతుడైన నారాయణుడిగానూ,
ఇఛ్ఛాశక్తి సమేతుడైన త్వష్టృబ్రహ్మను సరస్వతీ సమేతుడైన చతుర్ముఖబ్రహ్మగానూ,
క్రియాశక్తి సమేతుడైన శిల్పిబ్రహ్మను శచీ సమేతుడైన ఇంద్రుడిగానూ,
జ్ఞానశక్తి సమేతుడైన విశ్వజ్ఞబ్రహ్మను సంజ్ఞా సమేతుడైన భాస్కరుడిగానూ వేదములు, ఉపనిషత్తులూ కీర్తించినవి.

విశ్వకర్మయొక్క పంచముఖములనుండి పంచవేదములు ఉద్భవించినవి. వాటిలో;
తూర్పుముఖమునుండి ఉద్భవించిన ఋగ్వేదమునకు సానగబ్రహ్మర్షి(మనుబ్రహ్మ/శివుడు)ని,
దక్షిణముఖమునుండి ఉద్భవించిన యజుర్వేదమునకు సనాతనబ్రహ్మర్షి(మయబ్రహ్మ/విష్ణువు)ని,
పశ్చిమముఖమునుండి ఉద్భవించిన సామవేదమునకు అహభువనసబ్రహ్మర్షి (త్వష్టృబ్రహ్మ/బ్రహ్మ)ని,
ఉత్తరముఖమునుండి ఉద్భవించిన అధర్వణవేదమునకు ప్రత్నసబ్రహ్మర్షి(శిల్పిబ్రహ్మ/ఇంద్రుడు)ని,
ఊర్ధ్వముఖమునుండి ఉద్భవించిన ప్రణవవేదమునకు సుపర్ణసబ్రహ్మర్షి(విశ్వజ్ఞబ్రహ్మ/సూర్యుడు)ని అధిపతులుగా విశ్వకర్మ చేసినాడు.

రోజూ మనం చదివే గాయత్రి మన్త్రము అనునది ఈ సర్వజగత్ సృష్టికర్త, విరాట్ పురుషుడు మరియూ వేదపితయైన విశ్వకర్మ నుద్దేశించిన మన్త్రము.
అలాగే శివుడికి ఏకాదశ రుద్రాభిషేకము చేసిన తరువాత మన్యుసూక్తము చదవటంలోని అంతరార్థము మనుబ్రహ్మయే శివుడని.

సర్వజగత్ సృష్టికర్తయైన విశ్వకర్మ, ఈ మానవజాతి అభ్యుదయమునకై పంచశిల్పములను(పంచవృత్తులను) ఏర్పరిచి వాటికి అధిపతులుగా తన సంతానమైన పంచర్షులు/పంచబ్రహ్మలను చేసినాడు. అవి
(1) సానగబ్రహ్మర్షి(మనుబ్రహ్మ/శివుడు)కి......ఇనుము(కమ్మరము)
(2) సనాతనబ్రహ్మర్షి(మయబ్రహ్మ/విష్ణువు)కి.....కఱ్ఱ(వడ్రంగము)
(3) అహభువనసబ్రహ్మర్షి(త్వష్టృబ్రహ్మ/బ్రహ్మ)కి..తామ్ర/ఇత్తడి(కంచరము/కాంస్యకారము)
(4) ప్రత్నసబ్రహ్మర్షి(శిల్పిబ్రహ్మ/ఇంద్రుడు)కి.....శిల/ఱాతి(శిల్పము)
(5) సుపర్ణసబ్రహ్మర్షి(విశ్వజ్ఞబ్రహ్మ/సూర్యుడు)కి...స్వర్ణ/బంగారం(స్వర్ణకారము).
ఈ పంచవృత్తులు చేసేవారు వారివారి వృత్తుల ప్రకారం కమ్మరులు, వడ్రంగులు, కంచరులు(కాంస్యకారులు), శిల్పులు, స్వర్ణకారులు(కర్మశాలి/కంసాలి/అవుసలి) గానూ పిలువబడుతున్నా వీరందరూ ఈ సర్వజగత్ సృష్టికర్త, విరాట్ పురుషుడూ మరియూ వేదపితయైన విశ్వకర్మ మరియూ ఆయన ధర్మపత్ని మరియూ వేదమాతయైన గాయత్రీదేవిల వారసులయి యుండుటచేత పుట్టుకతోనే దైవత్వమును కలిగి దేవబ్రాహ్మణులైయుండి విశ్వబ్రాహ్మణ (విశ్వకర్మబ్రాహ్మణ/విశ్వకర్మ) కులమునకు చెందినవారైయున్నారు. మరియూ జన్మత: దైవత్వమును, దేవబ్రాహ్మణత్వము కలిగియుండుటచేత వీరు పీఠాధిపత్యములు వహించుటకు, వేదవిద్యలు పఠించుటకు, వేదవిద్యలు బోధించుటకు, యజ్ఞయాగాదులు నిర్వహించుటకు పరిపూర్ణమైన అధికారము, ప్రధమ సత్కారార్హత కలిగియున్నారు.

పంచవృత్తులు లేని మానవాభ్యుదయం లేదు. తల్లి గర్భమునుండి తరలి వచ్చిన బిడ్డయొక్క నాభి కోయటానికి ఉపయోగించే కత్తి నుండి కాటికేగేప్పుడు కావలసిన గడ్డపాఱ, పాఱ, గొడ్డలి, కొడవలి తదితర ఇనుప పరికరాలు కమ్మరి వల్లను; ఉండటానికి ఇల్లు, పడుకోటానికి మంచము వగైరాలు కావాలంటే వడ్రంగి వల్లను; కంచు, ఇత్తడి,రాగి పాత్రలు కంచరులు(కాంస్యకారులు) చేయుటవల్లనూ; దేవాలయనిర్మాణము, గాలిగోపురములు, శిల్పములు, విగ్రహములు, కుందులు, ఱోళ్ళు, ఱాతిచిప్పలు, తదితర ఱాతి సంబంధమైన పనులు శిల్పులు చేయుటవల్లనూ; చెవి కుట్టుపోగులనుండి మాంగల్యముల దాకా వివిధ ఆభరణములు స్వర్ణకారులు చేయుటవల్లనూ ...
మానవజాతికి విశ్వబ్రాహ్మణుల (విశ్వకర్మబ్రాహ్మణుల/విశ్వకర్మల) వల్ల అడుగడుగునా జరిగిన, జరుగుతున్న మేలు అందరికీ తెలిసిందే.

కాలమును లెక్కించుటకై తిథి, వారము, నక్షత్రం, యోగము, కరణము లతో పఞ్చాఙ్గము/పంచాంగము ను సృష్టికర్తయైన విశ్వకర్మ ఏర్పరచి, వాటికి అధిపతులుగా తన సంతానమైన పంచబ్రహ్మలను నియమించినాడు.

1) తిథి కి .... మనుబ్రహ్మ(శివుడు)

2) వారము నకు .. మయబ్రహ్మ(విష్ణువు)

3) నక్షత్రము నకు .. త్వష్టబ్రహ్మ(చతుర్ముఖబ్రహ్మ)

4) యోగము నకు .. శిల్పిబ్రహ్మ(ఇంద్రుడు)

5) కరణము నకు .. విశ్వజ్ఞబ్రహ్మ(సూర్యుడు)

పంచబ్రహ్మలలో ఒకడైన మయబ్రహ్మ(విష్ణువు) భూమండలమును పాపులనుండి రక్షించుటకై అనేక అవతారములు ఎత్తినాడు. వాటిలో పది అవతారములు ప్రాముఖ్యత గాంచినవి. దశావతారములలో చివరిదైన కల్కి లేదా వీరభోగవసంతరాయలుగా అవతరించుటకు ముందు శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామిగా అవతరించినారు. తెలుగువారిలో బ్రహ్మంగారి గురించి, వారు వ్రాసిన కాలజ్ఞానాన్ని గురించి తెలియనివారు అరుదు. ఎక్కడ ఏ వింత జరిగినా ప్రజలు బ్రహ్మంగారు చెప్పినట్లే జరుగుతున్నదని అనుకోవడం అందరికీ తెలిసిన విషయమే.

బ్రహ్మంగారు వ్రాసిన కాలజ్ఞానంలోని కొన్ని ముఖ్యమైన సంఘటనలు, నా గణితం ప్రకారం, ఈ క్రింది వరుస క్రమంలో జరుగవచ్చు. కాలజ్ఞానంలోని ప్రతిసంఘటనా జరిగితీరుతుంది. క్రింద ఇచ్చిన తేదీలలో జరగలేదంటే అది నా వైఫల్యమని గమనించగలరు

1.

శ్రీ వీరభోగవసంతరాయలవారు 'విశ్వావసు'నామ సంవత్సరము (1965-66)లో జన్మించి శ్రీ పరుశురాములవారు, శ్రీ అశ్వత్థామ, శ్రీ దత్తాత్రేయులవారు, శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారు, ఆచార్యా నాగార్జునులవారు, శ్రీ స్వర్ణ అమరలింగేశ్వరస్వామివారు, తదితర సిద్ధపురుషులవద్ద సమస్త విద్యలు నేర్చి ఆ తర్వాత పరమశివుడిని ప్రార్థించి వారిచే, తేది.22-11-2007న , దేవదత్త'మనే గుఱ్ఱమును, 'శుక'మనే చిలుకను, 'రత్నసారు' అనే ఖడ్గమును, 'కార్ముక'మనే విల్లును, అక్షయతూణీరములను, 'పాశుపత' అస్త్రమును, ఆశీస్సులను పొంది తేది.09-09-09 నాటినుండి బహిరంగంగా దుష్టశిక్షణ, శిష్టరక్షణ ప్రారంభించుటకు నిర్ణయించుకున్నారు. ఈ తేది.(09-09-09) నుండి గ్రహముల ఆగ్రహానుగ్రహములు సమస్తము శ్రీ వీరభోగవసంతరాయల వారి ఆధీనంలో వుంటాయి. బ్రహ్మ వ్రాసిన వ్రాత అంతమై, ప్రజలు వారు చేసే పాప పుణ్యాలనుబట్టి పూర్వజన్మ ఫలితాలతో సహా ఈ జన్మ ఫలితాలు ఎప్పటికప్పుడు అనుభవంలోకి వస్తాయి.

తేది.7/8-06-2036 లోపల, ప్రజలు తమ వ్యక్తిగత జీవితాల్లోని దుష్ఫలితాల తీవ్రత తగ్గించుకోవటానికి ఏ సిద్ధపురుషులకు లేదా దేవుళ్ళకు పూజ చేసినా వారి కర్మఫల తీవ్రత శ్రీ వీరభోగవసంతరాయలవారి ద్వారానే తగ్గేది. ఆ తరువాత కాలజ్ఞానంలోని సంఘటనలు యధాతధంగా జరుగుతాయి.

2.

ప్రమాధి నామ సం||(1999-2000) నుండి కరువుకాటకాలు, అతివృష్టి, అనావృష్టి, వ్యాధులు విజృంభిస్తాయి.

3.

తేది.13.04.2000 నాడు శ్రీ వీరభోగవసంతరాయలవారు విజయవాడ లో ఇన్ద్రకీలాద్రిపై యున్న శ్రీ కనకదుర్గ అమ్మవారి దేవాలయాన్ని దర్శించారు. ఆ సంవత్సరంలోనే శ్రీ వీరభోగవసంతరాయలవారికి వివాహము అయినది.

4.

అంతర్గత విస్ఫోటనములవల్లగానీ, తీవ్రవాదుల దాడులవల్లగానీ హైదరాబాదు, లేదా భారతదేశంలోని అణుసంస్థలకు/రక్షణ సంస్థలకు ప్రమాదము. ఏ అణుదాడి/అణుప్రేలుడు (అంతర్గత) ఐనా కర్కాటక మకర సంక్రమణముల మధ్య జరుగుతుంది. 2002 సంవత్సరము నుండి జరిగిన సంఘటనలు గమనార్హం. చావగా మిగిలిన వాళ్ళు రేగడి మట్టిలో చింతపండు కలుపుకుతిని బ్రతుక వలసి వస్తుంది. ఆచార్యా నాగార్జునుల వారు, ఆయన శిష్యుడు మందులు ఇచ్చి కాపాడుతారు.

ఇతర ప్రాంతాలలోకూడా అదే సమయాల్లో (కర్కాటక-మకర సంక్రమణముల మధ్య) అణుప్రేలుళ్ళు, దాడులు జరుగవచ్చు.

(2002 లో న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్సు నందు, ఆ తరువాత భారత్ డైనమిక్సు లిమిటెడ్, వేరే రక్షణ సంస్థలలో ప్రేలుళ్ళు జరిగాయి. అదృష్టవశాత్తు పెద్ద ప్రమాదములు తృటిలో తప్పి పోయినవి.)
------------------------
04-01-2001 :: Bharat Dynamics Limited, Hyderabad :: లో ప్రేలుడు
18-11-2002 :: న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్, హైదరాబాద్, లో అంతర్గతంగా ప్రేలుడు.
26-04-2003 :: ఇండియన్ డెటొనేటర్స్ లిమిటెడ్, హైదరాబాద్ లో ప్రేలుడు.
25-11-2003 ::ఇండియన్ డెటొనేటర్స్ లిమిటెడ్, హైదరాబాద్ లో ప్రేలుడు.
25-04-2013 ::ఇండియన్ డెటొనేటర్స్ లిమిటెడ్, హైదరాబాద్ లో ప్రేలుడు.
14-08-2013 ::అణుజలాంతర్గామి 'సింధురక్షక్' లో ప్రేలుడు. విధ్వంసం.
16-08-2013 ::డీ.ఆర్.డీ.ఓ., హైదరాబాద్, లో ప్రేలుడు. తప్పిన పెను ప్రమాదం.
__.12.2013 :: ఇండియన్ డెటొనేటర్స్ లిమిటెడ్, హైదరాబాద్ లో ప్రేలుడు.

కడప ఖాళీ అయ్యేను, బద్వేలు బస్తీ అయ్యేను (కాలజ్ఞానంలో వున్న మాట ప్రకారం కడప, ఆ పరిసర ప్రాంతాలు ఆణుధార్మికతకు/ అణుప్రేలుడుకు లోనై ఆ ప్రాంతాలు ఖాళీ చేయవలసి వస్తుంది.
కడప ఖాళీ అయ్యే తేది. Dt: __.__.20__

(ఆణుధార్మికతకు లోనైన ప్రజలను కాపాడటానికి సంబంధించిన వనమూలికలు ఒంగోలు, కర్నూలు జిల్లాలలో శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారు, శ్రీ ఆచార్యా నాగార్జునాచార్యులవారు, శ్రీ స్వర్ణ అమరలింగేశ్వరస్వామివార్ల ఆధ్వర్యంలో మే,2004 నుండి నా(బ్రహ్మశ్రీ పావులూరి శ్రీనివాసాచారి)చేత పెంచబడుతున్నాయి. గురుదేవుల ఆశీస్సులతో, నా ఆలనా పాలనలో మందులు సిద్ధం చేయబడుచున్నాయి. స్వామివార్ల ఆధ్వర్యంలో పెరుగుతున్న మూలికావనము కోసము చాలామంది ప్రయత్నాలు చేసారు, చేస్తున్నారు, చేస్తారు. ఈలాంటి వాళ్ళు వాళ్ళకే కాక, వారి వంశానికి కూడా చెఱుపు చేసుకుంటున్నట్లే.)

అమెరికా బహుళజాతి కంపెనీలకు లాభంచేకూరేలా, ఆ కంపెనీ ఉద్యోగులకు పనికల్పించేలా అమెరికా ప్రభుత్వంతో అణుఒప్పందం కుదుర్చుకుంది భారత ప్రభుత్వం. విపక్షాలు వద్దంటున్నా, తన ప్రభుత్వం పడిపోయే ప్రమాదముందని తెలిసీ సోనియాగాంధీ ఆధ్వర్యంలోని మన్మోహన్ సింగ్ ప్రభుత్వం తెగించి ఒప్పందం కుదుర్చుకొంది. ఈ ఒప్పందం సజావుగా కుదరటానికి భారతదేశంలోని అమెరికా తొత్తులు, అమెరికా బహుళజాతి కంపెనీల బ్రోకర్లు, నాసా చంకనాకుడు శాస్త్రవేతలు, అమెరికా గూఢచారిసంస్థ సీ.ఐ.ఏ.ఏజెంట్లు ఎంతమంది 'హస్తం' వుందో తెలియదు కానీ సమాధానాలు దొరకని ప్రశ్నలెన్నో. అంతా అధ్భుతంగా వుందని చెబుతారు అమెరికా వాళ్ళూ, భారత అణుశాస్త్రవేత్తలు.

రష్యాలోని చెర్నోబిల్ అణుకేంద్రంలో జరిగిన ప్రేలుడులాంటిది జరిగితే తక్షణమే ప్రజలను తరలించే సామర్థ్యం భారతదేశంలోని ఏ వ్యవస్థలకైనా వుందా? క్రొద్ది కాలం క్రితం సునామీ వచ్చినప్పుడు జపాన్ లోని ఫకుషిమా అణుకేంద్రం ప్రేలుడుకు గురైతే జపాన్ తీసుకున్నటువంటి తక్షణ ఉపశమన చర్యల్లో పదోవంతైనా తీసుకునే సామర్థ్యం భారత అణువ్యవస్థలకున్నదా?

భోపాల్ గ్యాసు దుర్ఘటన (2/3.డిసెంబరు.1984) జరిగినప్పుడు, దానికి కారణమైన యూనియన్ కార్బైడ్ కంపెనీ అధినేతలను సురక్షితంగా తప్పించటంలో వున్న శ్రద్ధ, భోపాల్ నగరవాసులను కాపాడటంలో చూపించలేక పోయింది రాజీవ్ గాంధీ ప్రభుత్వం. ఈ దుర్ఘటనలో వందలమంది చనిపోయారు. ఇప్పటికీ వేలాది మంది జీవచ్ఛవాలుగానే బ్రతుకు వెళ్ళదీస్తున్నారు.

జలియన్_వాలాబాగ్ నరమేధానికి కారకుడైన కర్నల్/జనరల్ డయ్యర్ ను కాల్చి చంపిన షహీద్ ఉధంసింగ్ వంటి వీరుడు లేకపోయాడు. ఉంటే, యూనియన్ కార్బైడ్ అధినేతను, వాడిని రక్షించిన వాళ్ళను వేటాడేవాడు. ఈ విదేశీయుల దృష్టిలో ఈ భారతదేశపు పౌరుల ప్రాణాలు చాలా చౌక. ఈ విషయంలో భారత సుప్రీమ్ కోర్టు ఇచ్చిన తీర్పుకు ప్రపంచ వ్యాప్తంగా ఎంతో మంది నిరసన తెలియ చేసారు, తప్పు పట్టారు. ఇప్పటికైనా చట్టాలను సవరిస్తారా?

కొవ్వాడ, నెల్లూరు వద్ద అణువిద్యుత్ కేంద్రాలు నిర్మించాలని నిర్ణయించారు. వీటికేమైనా ప్రమాదం జరిగితే కాకినాడ నుండి ఒడిషా లోని ఛత్రపూర్ వరకూ సర్వనాశనం అవుతుంది. వీటి దుష్ప్రభావం తరతరాలు వుంటుంది. ప్రమాదాలు జరిగితే వీటిని నిర్మించిన విదేశీ

కంపెనీలు బాధ్యత వహించవు. నష్టపరిహారం సంగతి దేవుడెరుగు కనీసం నొప్పులు తగ్గించే బిళ్ళలు కూడా ఇవ్వవు ఈ విదేశీ కంపెనీలు. ప్రజల గుండెలమీద అణుకుంపట్లే ఇవి.

5.
సం.1987 నుండీ ప్రకృతి వైపరీత్యాలు పెరుగుతాయి. రాబోయే సునామీ వల్ల దక్షిణేశ్వరమునుండి (కలకత్తా) శ్రీలంక దాకా సముద్రము 80 మైళ్ళు వెనుకకు వెళ్ళుతుంది. తద్వారా, కోణార్క వద్ద సూర్యుని రథసారథి అయిన అనూరుని దేవాలయం, విశాఖపట్నం వద్ద వైశాఖేశ్వరుని దేవాలయం, మోటుపల్లి వద్ద భద్రకాళీ సమేత వీరభద్ర దేవాలయం, శ్రీహరికోట వద్ద విగ్రహరూపంలో ఉన్న పార్వతీ పరమేశ్వరుల దేవాలయం, మొదలగు ఎన్నో దేవాలయాలు బైటపడతాయి.

2004 లో వచ్చిన సునామీ వల్ల మహాబలిపురం వద్ద కొన్ని కట్టడాలు, దేవాలయాలు బైటపడ్డాయి.

సునామీ అనే పదం అప్పటికి నాకు తెలియదుగానీ, అది రాకముందే "భూకంపం వచ్చి సముద్రం పొంగుతుంది" అని నా శిష్యులకు, చీరాల వాస్తవ్యులకు క్రొద్దిమందికి చెప్పడం జరిగింది.

(ఈ సునామీ మానవ సృష్టా? భారత్ తదితర దేశాలను లక్ష్యంగా పెట్టుకొని ఈ సునామీని సృష్టించారా? ఏడు దశాబ్దాల క్రితం అమెరికా, న్యూజిలాండ్ దేశాలు సంయుక్తంగా 'కృత్రిమం'గా సునామీ సృష్టించటంలో సఫలమయ్యారని చెప్పటానికి ఆధారాలున్నాయి. అలాంటి సాంకేతిక పరిజ్ఞానాన్ని ఎవరెవరు ఎంత అభివృద్ధి చేసారో.
అలాగే, గుజరాత్ భూకంపం (26.జనవరి.2001) కూడా శతృదేశాల సృష్టేనా?. సాంకేతికంగా అది సాధ్యమే. )

6.
తేది 09-04-2005 నుండే శ్రీ వీరభోగవసంతరాయలవారు సశరీరంగా దర్శనమిస్తున్నారు. తేది.04/10/2006 న మరియూ 04/09/2009 న శ్రీ స్వామివారు మహానంది సందర్శించారు. 09-09-09 కి ముందు శ్రీ వీరభోగవసంతరాయలవారు మాచర్లలోని చెన్నకేశవస్వామి దేవాలయము, యాగంటి, శ్రీకాళహస్తి, కుంభకోణం దేవాలయములు రోజుకు మూడుసార్లు దర్శించారు. ఇప్పుడు రోజుకు ఒక్కసారి మాత్రమే దర్శిస్తున్నారు. ఏ రోజున వారి సందర్శన ఆగుతుందో ఆ రోజున ఆయా దేవాలయములు దెబ్బతింటాయి లేదా కూలిపోతాయి.

మాచర్ల చెన్నకేశవస్వామి దేవాలయంలో, నా శిష్యుడొకనికి, సశరీరంగా శ్రీ దత్తాత్రేయుల వారి దర్శనభాగ్యం కలిగించాను.

7.
కృష్ణా గోదావరి నదులమధ్య రక్తం ఏఱులై పారుతుంది
అ)ప్రత్యేక రాష్ట్రాల కోసం,
ఆ)మతకల్లోలాలవల్ల,
ఇ)నీటికోసం

బ్రహ్మంగారు కాలజ్ఞానం వ్రాసినప్పటినుండి ఇప్పటిదాకా కృష్ణా గోదావరి నదుల మధ్య ఎన్నో యుద్ధాలు జరిగాయి. ఎంతో రక్తపాతం జరిగింది. ముఖ్యంగా, నిజాం పాలన నుండి తెలంగాణా విముక్తమయ్యేప్పటిదాకా హిందువుల మీద జరిగిన దారుణ మారణకాండ చారిత్రక సత్యం. తెలంగాణా(నిజాం నాటి)లో హిందువుల ఊచకోత మొదలెట్టి బందరు (మచిలీపట్నం) వద్ద సముద్రంలో రక్తంతో తడిసిన తమ కత్తులు కడుగుతామని రజాకార్లు చేసిన ప్రతిజ్ఞ కూడా తెలిసిందే. చెన్నారెడ్డి ఆధ్వర్యంలో జరిగిన తెలంగాణా ఉద్యమ సమయంలో సీమాంధ్రుల మీద జరిగిన దాడులు, అత్యాచారాలూ ఎన్నో. వేలమంది సీమాంధ్రులు ప్రాణాలు అఱచేతపెట్టుకొని పారిపోవటం తెలిసిందే. పదవులకోసం, ప్రభుత్వాల్ని పడగొట్టడం కోసం ఎన్నోసార్లు మతకల్లోలాలు రేపిన నీచులు ఎంతమందో. ఇదొక అస్త్రం. కొత్తగా దొరికిన రెండో అస్త్రం తెలంగాణా-సీమాంధ్రుల మధ్య వైరం పెట్టడం. నిజాం పాలన నుండి విముక్తమైన తెలంగాణా సరిహద్దులూ ఇప్పటి తెలంగాణా సరిహద్దులూ ఒక్కటేనా? కలిసిన ప్రాంతాలు ఎన్ని? వేరే రాష్ట్రాల్లో కలపబడ్డ ప్రాంతాలెన్ని? రాజ్యభ్రష్టులైన వారు ఏ అవకాశాన్నీ వదలరు. కాలజ్ఞానంలో చెప్పబడ్డ ఒక ముఖ్యమైన, చరిత్రలో రక్తాక్షరాలతో లిఖింపబడబోయే, "మహామతసంగ్రామం" ఎక్కడ మొదలౌతుందనే విషయం ప్రక్కనపెడితే అది కృష్ణా-గోదావరి నదుల మధ్య పతాకస్థాయికి చేరి కృష్ణానది ఒడ్డున వున్న కనకదుర్గ అమ్మవారి గుడి వద్ద

అంతమౌతుంది. అలాగే, నీటి కొఱత కూడా రక్తపాతానికి దోవ తీస్తుంది.

7.అ)

1991 వ సంవత్సరంలో నా గురుదేవుల వద్దనున్న శ్రీ బ్రహ్మంగారి కాలజ్ఞానము, శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారి కాలజ్ఞానము, శ్రీ స్వర్ణ అమరలింగేశ్వరస్వామి వార్ల కాలజ్ఞానములు చూసిన తరువాత తెలంగాణా విభజన జరిగితీరుతుందనే నిర్ణయానికి రావటం జరిగింది (అప్పుడే చాలమందితో చెబితే నమ్మని వాళ్ళే ఎక్కువ). కాలజ్ఞాన విశేషాలు గ్రంథంగా ప్రచురించటం మొదలు పెట్టినప్పటినుండి (2005 నుండి) అవిభాజ్య ఆంధ్రప్రదేశ్ లోని దాదాపు ప్రతి ఎం.ఎల్.ఏ.కీ, ఎం.పీ.లు అందరికీ ఆ గ్రంథప్రతులు పంపించటం జరిగింది. రక్తపాతంతో కాకుండా ప్రశాంతంగా విభజన జరగాలన్నదే నా తాపత్రయం. ప్రస్తుతానికి పరిస్థితులు బాగానే వున్నాయి.

2012 సెప్టెంబరులో చంద్రబాబునాయుడుగారిని కలిసి, నా గ్రంథం పదవ ముద్రణ (17.09.2012) ప్రతి ఇచ్చి(ఫొటోలో గమనించవచ్చు), "బ్రహ్మంగారి కాలజ్ఞానం" లో కృష్ణా గోదావరుల మధ్య రక్తం ఏఱులై పారేను అని ఉంది, ఖచ్చితంగా ప్రత్యేకరాష్ట్రం(తెలంగాణా) కోసం, నీళ్ళకోసం, మతకల్లోలాల వల్లనే ఇలా జరుగుతుంది అని వివరించటం జరిగింది. కాగా, ఉద్రిక్తతలకు ఆయనకూడా ఒక కారణం కావడం దురదృష్టకరం.





పంచుడో, దంచుడో; పుచ్చెలు/తలకాయలు లేచిపోతాయ్; అగ్ని గుండమౌతుంది; ఒక అమ్మ అబ్బకు పుట్టిఉంటే; సీమాంధ్రుల్ని తరిమి కొడతాం, సీమాంధ్రులు ఖాళీ చేసి వెళ్ళాల్సిందే, ఇవీ తెలంగాణా కోసం పోరాడుతున్నానని చెప్పే ఒక రాజకీయనాయకుడి ప్రేలాపనలు (కే.సీ.ఆర్.). ప్రభుత్వ ఉద్యోగం చేస్తూ ఉద్యమానికి నాయకత్వం వహించాడొకడు(ప్రొఫెసర్ కోదండరాం). ఏకంగా హైకోర్ట్ ముందే లాయర్ల ప్రదర్శన, ఉద్రిక్తత. తక్షణ చర్యలు తీసుకోలేని న్యాయవ్యవస్థ.

ప్రజలను భయభ్రాంతులను చేసే ప్రకటనలను చేసే వాళ్ళను, అప్పనంగా జీతం తీసుకుంటూ ఉద్యోగానికి వెళ్ళకుండా ఉద్యమాల్ని నడిపేవాళ్ళను జాతీయ భద్రతా చట్టం క్రింద, లేక వేరే చట్టాల ప్రకారము తగిన చర్యలు తీసుకోలేని నిర్వీర్య, 'గుడ్డి' రాజ్యాంగ వ్యవస్థలు ఉంటే రక్తం ఏఱులై పాఱకుండా వుంటుందా?

తెలంగాణా నాయకుల ప్రకటనలు, అక్బరుద్దీన్ ప్రకటనలు, హైదరాబాదులో జరుగుతున్న ప్రేలుళ్ళు చూస్తుంటే గొల్లకొండ (గోల్కొండ రాజ్యము) త్వరలోనే స్మశానంగా మారటానికి సిద్ధంగా వుంది. అలానే తెలంగాణా రాష్ట్రం ఏర్పడిన తరువాయి నీటికోసము జరిగే యుద్ధాలవల్ల రక్తం ఏఱులై పారుతుంది.

తెలంగాణా విభజన జరిగింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము తెలంగాణా, అంధ్రప్రదేశ్ లు గా విడిపోయాయి. ఈ విభజన వెనుక 'విదేశీమతా'ల 'హస్తా'ల పాత్ర,'చరిత్రహీనుల' పాత్రా కీలకమైంది.

కానీ ఈ విభజనకు సంబంధించి జరిగినవన్నీ రాజ్యాంగ విరుద్ధంగా జరిగాయి, లోక్_సభలో ఈ బిల్లు పాస్ కాలేదు కాబట్టి చెల్లదంటున్నారు శ్రీ ఉండవల్లి అరుణ్ కుమార్ గారు. అందుకు సంబంధించిన సాక్ష్యాలను రాష్ట్రపతికి సమర్పించాడు. అతని వాదనను అంగీకరిస్తూ అతను పెట్టిన పిటీషన్ ను అడ్మిట్ చేసి విచారణకు అంగీకరించింది. అతను చెప్పే వాదన నిజమేనని సుప్రీంకోర్టు అంగీకరిస్తే ఏం జరుగుతుంది? దాని

పర్యవసానాలు ఎలా వుండబోతున్నాయి? గొడవలు కాకుండా ఉండాలని ఆశిద్దాం.

22.june.2015 తేది నాటికి పరిస్థితులు గమనించండి. అక్బరుద్దీన్ ప్రకటనలు, తెలంగాణా రాష్ట్రం కోసం ఉద్యమం జరుగుతున్నప్పుడు కే.సీ.ఆర్., కోదండరాంల ప్రకటనలతో ఎప్పుడు ఏం జరుగుతుందోనని ప్రజలుభయపడితే ఇప్పుడు చంద్రబాబునాయుడు మరియు కే.సీ.ఆర్.ల మధ్య వైరం అత్యంత ప్రమాదకరంగా తయారయ్యింది.

ఇద్దరు వ్యక్తుల(చంద్రబాబునాయుడు మరియు కే.సీ.ఆర్.ల) మధ్య వైరం అవిభాజ్య ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాలుగా చీలిపోవటానికి ముఖ్య కారణమైంది. ఇప్పుడు ప్రత్యక్షంగా రెండు రాష్ట్రాల ప్రజల మధ్య ద్వేషం రగిలేలా ఉన్నాయి పరిస్థితులు. స్టీఫెన్సన్ కు రేవంత్ రెడ్డి లంచం ఇస్తూ నిఘాకెమేరాలకు చిక్కిన విషయం తెలిసిందే. ఇది పూర్తిగా చంద్రబాబు వ్యక్తిగత లేదా తెలుగుదేశంపార్టీకి సంబంధించిన విషయం. కానీ, ఈ కేసు వెలుగులోకి వచ్చిన తరువాత ఎక్కడ చంద్రబాబునాయుడిని అరెస్ట్ చేస్తారోనని తెలుగుదేశంపార్టీ వాళ్ళు దీన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మీద, ముఖ్యమంత్రి మీద, సీమాంధ్రుల మీద జరుగుతున్న దాడిగా వర్ణిస్తున్నారు. తనను అరెస్ట్ చేస్తే రాజ్యాంగసంక్షోభం సృష్టిస్తాను, కే.సీ.ఆర్.ప్రభుత్వాన్ని కూలుస్తానంటాడు చంద్రబాబునాయుడు. తెలంగాణా రాష్ట్రం ఏర్పడిన తరువాత ఇప్పటివరకు సీమాంధ్రులకు తెలంగాణావాళ్ళకు ఘర్షణలు జరగక పోయినా, సీమాంధ్రులకు భద్రత కరువయ్యిందనీ హైదరాబాదులో ఆంధ్రా పోలీస్ స్టేషన్లు పెట్టుకుంటామంటాడు(ఏ చట్ట ప్రకారమో చెబితే ఆయనకున్న న్యాయపరిజ్ఞానానికి సీమాంధ్ర ప్రజలు మురిసిపోతారు), గవర్నర్ ను గంగిరెద్దు అని అంటాడు అచ్చెన్నాయుడు (గవర్నర్, కేంద్రప్రభుత్వం ఆగ్రహం వ్యక్తం చేసిన తరువాత ఆ వ్యాఖ్యలు వెనక్కి తీసుకుంటున్నానన్నాడే కానీ, గవర్నర్ కు క్షమాపణ చెప్పలేదన్నది గమనార్హం). విశ్వాసం లేని గంగిరెద్దు అంటాడు 'గాలి'. ధృతరాష్ట్రుడంటాడు ఇంకో పెద్దాయన. అధికారమదం తలకెక్కి విచక్షణ కోల్పోయిన, రాజ్యాంగ వ్యవస్థలను 'జేబులో' సంస్థలుగా ఉండాలనుకొనే ఇలాంటి నాయకుల మూలకంగా రెండు రాష్ట్రాల ప్రజల భవిష్యత్తు రక్తాక్షరాలతో వ్రాయబడబోతున్నదా? ఇక్కడ బాధాకరమైన విషయం ఏమిటంటే వీళ్ళ మధ్య వైరానికి మొదటి బలిపశువులుగా పోలీసులు కావటం.

రాష్ట్రాల విభజన తెలంగాణాతో ఆగదు. ఉత్తర భారతదేశము, దక్షిణ భారతదేశములుగా విడిపోవాలనే క్రొత్త ఉద్యమం తలెత్తుతుంది. క్రొద్ది కాలం క్రితమే ఉత్తర-దక్షిణ భారతదేశములనే వాదనకు నాంది కర్నాటక రాష్ట్రంలోనూ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనూ పడింది. ఉద్యమ రూపం దాల్చటానికి క్రొద్ది సమయం పడుతుంది.

7.ఆ)1)
లక్ష్మీదేవి గురించి విన్నాం కానీ ఈ భాగ్యలక్ష్మి ఎవరు?;
7.ఆ)2)
పోలీసులు పదిహేను నిముషాలు పక్కకు తప్పుకుంటే వందకోట్లమంది హిందువులను నిర్మూలిస్తాం ...... మతోన్మాదపార్టీ అయిన ఎమ్.ఐ.ఎమ్.శాసనసభాపక్షం నాయకుడు అక్బరుద్దీన్ ఒవైసీ నిర్మల్, నిజామాబాద్ లలో చేసిన విషపూరిత ప్రసంగాలు, మతోన్మాద ప్రేలాపనలలో ఒక భాగం.

7.ఆ)1)
చార్మినార్ భవనాన్ని అంటుకుని ప్రస్తుతం వున్న ఓ చిన్న గుడి 'భాగ్యలక్ష్మి' దేవాలయమనీ, ఏడు శతాబ్దాల క్రితం అక్కడే భాగ్యలక్ష్మి అమ్మవారికి పెద్ద దేవాలయం వుండేదనీ, దాన్ని జిహాదీలు ధ్వంసంచేసి ఆ దేవాలయం స్థానంలో ఏం కట్టారో అక్బరుద్దీన్ ఒవైసీ కి తెలియదని అనుకోలేం.
దేశవిభజన జరగడానికి దారి తీసిన వైపరీత్యాలలో ఒకటి-అఖండభారత దేశమంతటా ముస్లిం జిహాదీలచేత జరిగిన హిందూదేవాలయాల విధ్వంసం.
--------- (హెబ్బార్ నాగేశ్వరరావు గారి వ్యాసంలో క్రొద్ది భాగం) క్రీ.శ.712 లో 'మహమ్మద్ బిన్ కాసిమ్' అనే అరబ్బీ ముస్లిం భీభత్సకారుడు సింధు ప్రాంతంలోని దేవల పట్టణంలోకి దొంగచాటుగా రాత్రిపూట చొరబడింది హిందూ దేవాలయ విధ్వంసం తరువాతనే. అప్పటినుంచి ఇప్పటివరకు 'అఖండభారతం' లోని ఏదో ఒక ప్రాంతంలో హిందూదేవాలయాల ధ్వంసం జరుగుతూ ఉండడం చరిత్ర.

శతాబ్దాల తరబడి మహమ్మద్ బిన్ కాసిం అతడి జిహాదీ వారసులైన గజనీలు, ఘోరీలు, ఖిల్జీలు, తుగ్లక్ లూ, బహమనీలు, మొఘలాయిలు,

రజాకార్లు సాగించిన హిందూ దేవాలయ విధ్వంసంతో దక్షిణభారత చరిత్ర ముడివడి ఉంది. తెలంగాణా వ్యధ ముడివడి ఉంది. భాగ్యనగరం పేరు ముడివడి ఉంది. క్రీ.శ.1947 నాటికి పాకిస్తాన్, తూర్పుపాకిస్తాన్ (ప్రస్తుతం బంగ్లాదేశ్)లలో వేల సంఖ్యలో వున్న హిందూ దేవాలయాలు వందల సంఖ్యలోకి రావడానికీ భాగ్యనగరం పేరు హైదరాబాద్ గా మారడానికీ మధ్య చారిత్రక సంబంధం వుంది. ఈ దేశంలో అనాదిగా పరిఢవిల్లుతున్న సర్వమతసమభావ వ్యవస్థకు పునాది అయిన హైందవ జాతీయతత్వానికీ, ఇస్లాం తప్ప సర్వమతాలను ధ్వంసం చేయాలన్న జిహాదీ తత్వానికీ మధ్య క్రీ.శ.712 నుండి జరిగిన ఘర్షణ ఈ చారిత్రక నేపథ్యం. 'సర్వమత సమభావం' గెలిచినప్పుడల్లా నిలిచినప్పుడల్లా ఇస్లాం తదితర విదేశీయ మతాలతో సహా అన్ని మతాలకు సమాన ఆదరణ, సమాన రక్షణ, సమాన ప్రతిపత్తి లభించడం చరిత్ర. కానీ 'సర్వమత సమభావం' ఓడిపోయి 'జిహాదీ మతోన్మాదం' గెలిచినప్పుడల్లా ఆయా ప్రాంతాలలో అనాదిగా వున్న సనాతన హైందవ మతాలు, మతాల చిహ్నాలు నిర్మూలనకు గురి కావడం కూడా చరిత్ర. అన్యమత చిహ్నాలను నిర్మూలించే జిహాదీ బీభత్సంలో భాగం ఆలయ విధ్వంసం.. భాగ్యనగరం పేరు హైదరాబాద్ గా మారడం ఈ జిహాదీ విధ్వంసంలో భాగం. స్వజాతీయ చిహ్నాలను నిర్మూలించి జిహాదీ చిహ్నాలను వెలయించడంలో భాగం.

'పాలమూరు' మహబూబ్_నగర్ అయ్యింది. తాండూరు ఆదిలాబాద్ అయ్యింది. గొల్లకొండ వికృతమై గోలకొండ అయ్యింది. ఇందూరు నిజామాబాద్ అయ్యింది. ఈ జిహాదీ భీభత్స క్రమంలో 'భాగ్యనగరం' హైదరాబాద్ అయింది!! ఇక్కడ మాత్రమే కాదు దేశమంతటా ఈ ఘోరాలు జరగడం జిహాదీల 'విజయాల' ఫలితం? తేజోమహాలయం 'తాజ్ మహల్' గా మారింది. కర్ణావతి అహ్మదాబాద్ అయిపోయింది. కుతుబ్_మినార్ గా విశ్వకర్మధ్వజం మారింది. క్రీస్తునకు పూర్వం ఒకటవ శతాబ్దిలో భారత సామ్రాట్ విక్రముడు పూజలు చేసిన అనాది రామజన్మభూమి మందిరం (లేదా విష్ణాలయము) క్రీస్తుశకం పదహారవ శతాబ్దిలో బయట దేశాలనుంచి దురాక్రమించిన జిహాదీ భీభత్సకారుడు మొఘలాయి బాబర్ కట్టడంగా మారిపోయింది. 'ఇస్లాం జిహాదీ మతోన్మాదం' గెలిచినప్పుడల్లా 'సర్వమత సమభావం' ఓడి పోయినప్పుడల్లా ఇదే జరగడం పదమూడు శతాబ్దుల భారత చారిత్రక వ్యధ.

'బాగమతి' అన్న మహిళను చరిత్రలో నిలబెట్టడానికి జరిగిన యత్నం కూడా స్వజాతీయ ఆలయ విధ్వంస క్రమంలో పుట్టుకొచ్చిన పరిణామం. బాగమ్మలు బాగయ్యలు వందలు వేలుగా చరిత్రలో వుండవచ్చు. పుట్టి పెరిగి వుండవచ్చు. అలాగే 'బాగమతి' ఉండి ఉండవచ్చు. కానీ అనాదిగా ఉన్న భాగ్యలక్ష్మీదేవి ఆలయం సమీపంలో వెలసిన నివాసవాటిక 'భాగ్యలక్ష్మీనగరం', 'భాగ్యనగరం'గా పేరుగాంచడం సహజం. ఈ దేశంలోని సహజపరిణామాలు, అనాది చరిత్ర ఏదో ఒక మతానికి ముడిపెడుతున్నవారు, అనేక మతాలతో కూడిన హిందూ జాతీయతత్వాన్ని కేవలం ఒక మతంగా చిత్రీకరిస్తున్నవారు ఈ భాగ్యలక్ష్మీ దేవత ప్రస్తావన లేని 'భాగ్యనగర చరిత్ర'ను ప్రచారం చేయడానికి చేసిన యత్నంలో భాగం కధాకధిత 'బాగమతి. 'బాగమతి' పేరుతో ఈ మహానగరం వెలసి ఉండినట్లైతే 'బాగమతీనగరం' కావాలి, లేదా 'బాగనగరం' కావాలి. 'బాగ్' అంటే తోట. 'బాగయ్య' అంటే తోటయ్య అని అర్థం. తెలుగునాట తోటప్ప, తోటమ్మ అన్న పేర్లు అనాదిగా ఉన్నాయి. 'తోట' ప్రకృతిమాతకు ప్రతీక. ప్రకృతి ఆరాధన అనాదిగా వేద సంప్రదాయం. క్రీ.శ.పదహారవ శతాబ్ది ద్వితీయార్ధంలో పన్నెండేళ్ళ వయస్సు వాడైన మహమ్మద్ కులీ కుతుబ్ షా అనే గొల్లకొండ యువరాజు 'బాగమ్మ'నో 'బాగమతి'నో ప్రేమించాడట (ఆమె వయస్సు ఎంతో మరి!?) ఈ 'ప్రేమ' ముదిరిన తరువాత ఆయన కూడా ముదిరి రాజయిన తరువాత, ముప్పై ఏడు మంది యువతులకు భర్త లేదా ప్రియుడయ్యాడట! అప్పుడు 'బాగమతి' పేరుతో ఆయన 'భాగ్యనగరం' నిర్మించాడని చెప్పడం చారిత్రక వక్రీకరణకు పరాకాష్ట! ఈ చరిత్ర ప్రచారం పెరిగిన కొద్దీ భాగ్యలక్ష్మీదేవి ఆలయ చరిత్ర ధ్వంసమైపోయింది. ఆలయాలు ధ్వంసం.. చరిత్ర విధ్వంసం.

అనాదిగా భాగ్యలక్ష్మీ మాత దేవాలయం వున్న ప్రాంతమే భాగ్యనగరం అయితే ఆలయం ఎక్కడుందో చూపించండి అని ప్రశ్నించే చరిత్రకారులున్నారు. చార్మినార్ కి ఆనుకొని ఉన్న ఈ చిన్న గుడి అనాదిగా వున్న భాగ్యలక్ష్మి అమ్మవారి దేవాలయమా అని యెద్దేవా చేసేవారు కూడా వున్నారు. క్రీ.శ.712 నుండి దేశవ్యాప్తంగా జరిగిన ఆలయ విధ్వంసం చారిత్రక వాస్తవం. ఈ వాస్తవాన్ని అంగీకరించిన వారికి భాగ్యనగరంలో పెద్ద భాగ్యలక్ష్మీ దేవాలయం ఒకప్పుడు వుండేదన్న విషయమై అనుమానం రాదు.

క్రీ.శ.1323 ప్రాంతంలో కాకతీయ సామ్రాజ్యాన్ని వంచనతో అధర్మ యుద్ధంలో ధ్వంసం చేసారు ఖిల్జీలు, తుగ్లక్ లు. ఆ తర్వాత అనేక ఏళ్ళపాటు కాకతీయ రాజధాని ఓరుగల్లు చుట్టుపట్ల వున్న హైందవ జాతీయ చిహ్నాలను జిహాదీలు నామరూపాలు లేకుండా చేసారు. ఈ జాతీయ సాంస్కృతిక విధ్వంసం క్రీ.శ.1948 లో నిజాంల పాలననుండి హైదరాబాద్ విముక్తమయ్యేవరకు కొనసాగింది. క్రీ.శ.14వ శతాబ్దిలో గొల్లకొండ సమీపంలోని భాగ్యలక్ష్మి దేవాలయం ధ్వంసమైంది. మళ్ళీ పునరుద్ధరణకు జరిగిన యత్నాలు పాత ఆలయం స్థానంలో క్రొత్త

ఆలయాలను నిర్మించిన ఘట్టాలు 'ఇస్లాం మత రాజ్యవ్యవస్థ' పద ఘట్టనల క్రిందపడి పగిలిపోయాయి.

భాగ్యలక్ష్మి ఆలయం, ఎక్కడ ఉండేది అన్నదానికి ఖచ్చితమైన ఆధారాలను భారతీయ పురాతత్వ శాఖవారు తవ్వి తీయాలి. తవ్వి తీయడానికి వీలులేకుండా 'ఆలయం' ఉన్న స్థలంలో ఇతరమైన కట్టడాలు వుంటే ఆ పనికూడా జరగదు. అయోధ్యలో 'బాబరీ కట్టడం' వద్ద పురాతత్వశాఖ వారు తవ్వినారు కనుక భూగర్భంలో అతి విశాలమైన, ప్రాచీనమైన రామజన్మభూమి (లేదా శ్రీమహావిష్ణువు) దేవాలయం బయటపడింది. తవ్వని చోట, తవ్వడానికి వీలులేకుండా, ప్రాచీన ఆలయాల స్థానంలో ఇతరేతరమైన కట్టడాలు నిలిచి వున్న చోట ఈ ప్రాచీన జాతీయ సాంస్కృతిక కేంద్రాల ఉనికి ఎలా గుర్తించేది? తరతరాల విశ్వాసం మాత్రమే తిరుగులేని ఆధారం. దేశమంతటా ఆలయాల విధ్వంసం జరిగిన కాలంలో భాగ్యలక్ష్మి ఆలయం ధ్వంసమైంది. ఇప్పుడు చార్మినార్ వద్ద గల 'చిన్న గుడి' వున్న చోటనే అనాది భాగ్యలక్ష్మి ఆలయం కూడా ఉండేదన్నది విశ్వాసం. తవ్వి చూస్తారా???

మహమ్మద్ బిన్ కాసిం చొరబడే నాటికి ఇప్పటి పాకిస్తాన్ అంతటా వంద శాతం ప్రజలు భారతీయ మతాలవారు. అంతకు పూర్వం ఇస్లాం మతం పుట్టక పూర్వం, అనాదిగా, ఇప్పటి పాకిస్తాన్ ప్రాంతంలో ఎన్నివేల దేవాలయాలున్నాయి? ఆ వంద శాతం హిందువులు నిర్మూలనకు గురి అయిన తరువాత ఆ దేవాలయాలు ఏమయ్యాయి? అంతెందుకు .. 1990 లో కాశ్మీర్ లోయనుండి సంపూర్ణంగా హిందువులను ఇస్లాం జిహాదీలు నిర్మూలించిన తరువాత అప్పటికి మిగిలిన ఆలయాలు ఈ రెండున్నర దశాబ్దులలో ఏమయ్యాయి? ఆలయం ఉన్న చోట 'ఇంకేదో ఉంది.

7.ఆ)2) దేశంలోని హిందువులను చంపి రాజ్యాధికారం చిక్కించుకోవాలన్నదే మతోన్మాదపార్టీ అయిన ఎమ్.ఐ.ఎమ్. ఉద్దేశంగా కనబడుతుంది. ఎమ్.ఐ.ఎమ్.నాయకుడు అక్బరుద్దీన్ తన మనసులో ఉన్న అభిప్రాయాన్ని బయటపెట్టాడు. అందులో ఎలాంటి అనుమానమూ లేదు. ఎమ్.ఐ.ఎమ్.నేతల మదిలో ఈ అభిప్రాయం ఇప్పటికిప్పుడే వచ్చింది కాదు. దశాబ్దాల నుండి ఉన్నదే! 1948లో నిజాంరాష్ట్రంలో హిందువులనందరినీ తుదముట్టించి, వారి ఆస్తులను స్వాధీనం చేసుకోవాలని నిజాంసైన్యాధ్యక్షుడైన కాశింరజ్వీ పథకం సిద్ధం చేశాడు. గోవులను పవిత్రంగా భావించే హిందువులకు పాలించే శక్తి లేదన్నది కాశింరజ్వీ సిద్ధాంతం. హైదరాబాద్ రాష్ట్రంలో ఉన్న 1.67 కోట్లమంది హిందువులను తుదముట్టించి, హైదరాబాద్ రాష్ట్రాన్ని ఇస్లామిక్ దేశంగా ప్రకటించాలని ప్రయత్నించిన ఘనమైన చరిత్ర వారిది. ఆనాడు కాశింరజ్వీ చేసిన ప్రకటనకు నేడు అక్బరుద్దీన్ ఒవైసీ చేసిన ప్రకటనకు ఎలాంటి తేడా లేదు. అక్బరుద్దీన్ కూడా ఇప్పుడు 100కోట్ల మంది హిందువులను చంపివేస్తామని ప్రకటించాడు. ఒక ముస్లిం 10మంది హిందువులతో సమానమని, పోలీసులు 15నిముషాలు చేతులు ముడుచుకొని ఉంటే ముస్లింలు అంతా కలసి హిందూ సమాజాన్ని తుద ముట్టిస్తామంటూ ఒవైసీ చేసిన ప్రకటన దేశద్రోహంకన్నా ఎక్కువే!

( ఖాసిం రజ్వీ-నిజాం-ఎమ్.ఐ.ఎమ్.పార్టీ-నెహ్రూ ల సంబంధం:: 1)నిజాం ఉస్మాన్ అలీ ఖాన్ .. అసిఫ్ ఝా.V11 .. ప్రభుత్వానికి వెన్నుదన్నుగా నిలబడేందుకు.. ఇక్కడి హిందువులను ఊచకోత కోసేందుకు లాతూర్ నుంచి వచ్చిన పరమ దుర్మార్గుడు ఖాసిం రజ్వీ .. 2) ఖాసిం రజ్వీ ఆధ్వర్యంలో వున్న మిలిటెంట్ గ్రూప్ (నిజాం అనఫిషియల్ సైన్యం) 'రజాకర్ల' పేరుతో చెలామణి అయ్యేది.. 3) రజాకార్లు ఎంతటి రాక్షసులు అంటే (ఈ రోజుల్లో మన ఊహకు కూడా అందనంత అక్రమంగా నిజాం నిర్దేశించిన పన్నులు వుండేవి) పన్నులు చెల్లించని వారి గోర్ల కింది మాంసం కత్తి తో కోసి గోర్లు ఊడబెరికేవారు. భర్తల ముందే భార్యలను అత్యాచారం చేసేవారు .. భార్యల ముందే భర్తలను నరికి చంపే వారు .. భర్తల ఆచూకీ చెప్పక పోతే పిల్లవాళ్ళను పైకి ఎగరేసి కత్తికి గుచ్చి చంపేవారు. ఆ రోజుల్లో రజాకార్లకు ఎదురెళ్ళిన వాళ్ళెవరూ బ్రతికిన దాఖలాలు లేవు. రజాకార్లు గుఱ్ఱాల మీద ఊళ్ళ వెంట పోతుంటే .. అంతా భయం భయంగా తలుపులేసుకొని చిన్న చిన్న సందుల్లోంచి చూసేవాళ్ళు. రజాకార్లు వెళ్తున్న సమయంలో ఎవరైనా రోడ్డుమీద కనిపిస్తే..వాళ్ళను గుఱ్ఱాలకు కట్టి ఈడ్చుకెళ్ళి పాశవికంగా హత్య చేసేవాళ్ళు.. 4) రజాకార్ల అండతో..ఆఖరి నిజాం..హైదరాబాద్ సంస్థానాన్ని పాకిస్తాన్ లో కలిపేందుకు లేదా స్వతంత్ర రాజ్యంగా వుండాలనే గట్టి ప్రయత్నం చేశాడు..నిజాం తరపున రాయబారానికి ఢిల్లీ వెళ్ళిన ఖాసీం, "హైదరాబాద్ ను భారత్ లో కలపాలి అని చూస్తే ఇక్కడ వున్న కోటిమంది హిందూవులను ఊచకోత కోస్తాము' అని బెదిరించాడు. నీకు ఇద్దరు భార్యలు, ఆరుగురు పిల్లలు మాత్రమే వున్నారు..కానీ మీ నిజాం కు పదుల సంఖ్యలో భార్యలు, వందల సంఖ్యలో పిల్లలు వున్నారు. వారందరూ భద్రంగా వుండాలి అని మా కోరిక..అని రివర్స్ పంచ్ తో సర్దార్ వల్లభభాయ్ పటేల్, ఖాసీం ని హెచ్చరించాడు. 5) 13.సెప్టెంబరు.1948 వరకూ రజాకార్ల దుర్మార్గాన్ని హైదరాబాద్ సంస్థానం భరించక తప్పలేదు..భారత ప్రభుత్వానికి సహకరిస్తే నిట్టనిలువునా ప్రాణాలు తీస్తామని రజాకార్లు హైదరాబాద్ సంస్థానంలో వున్న హిందువుల్ని బెదిరించారు. దాదాపుగా 32,000 మంది హిందువులు సికిందరాబాద్ లోని మిలిటరీ కంటోన్మెంట్ లో ప్రాణభయంతో తలదాచుకున్నారు. 6) ఆఖరి నిజాం..17.సెప్టెంబరు.1948 న హైదరాబాద్ సంస్థానాన్ని భారత ప్రభుత్వానికి స్వాధీనం

చేసిన తర్వాత ..రజాకార్ల సైన్యంలో చాలామంది పాకిస్తాన్ కి పారిపోయారు.. ఇక్కడే మిగిలిపోయినవాళ్ళు మాత్రం గెడ్డాలు తీసేసి..మామూలు పౌరుల్లో కలిసిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు..దొరికిన రజాకార్లను భారత సైన్యం చంపి వేసింది.. చివరి నిముషంలో ఖాసీం రజ్వీ విషయాన్ని అర్థం చేసుకున్నాడు. ఇక్కడే వుంటే..నిట్ట నిలువునా జనం చీల్చి చంపుతారన్న విషయం తెలిసిపోయింది..పాకిస్తాన్ కి పారిపోవాలి..అంటే..నిజాం లొంగిపోవాలి.. అప్పుడే ప్రాణాలు దక్కుతాయి..అప్పటి ప్రధాని నెహ్రూ.. రజాకార్లు పాకిస్తాన్ కి వెళ్ళిపోవడానికి అనుమతించాడు... వల్లభభాయ్ పటేల్ భారత సైన్యానికి చెప్పింది..నిజాంని అరెస్ట్ చేసి, ఖాసీం రజ్వీని చంపేయమని.. కానీ.. పరమదయాళువు, భూతదయ కలిగినవాడు, కరుణామయుడు, ప్రపంచానికే శాంతిదూత అయిన నెహ్రూ జోక్యం చేసుకొని నిజాంని ఏమీ చేయొద్దనీ, ఖాసిం రజ్వీని అరెస్ట్ చేయమని పటేల్ మీద ఒత్తిడి తీసుకొచ్చాడు.(రజాకార్ల చేతిలో వేలాదిమంది హిందువులు హత్య చేయబడ్డా చలించని నెహ్రూ .. పటేల్ ఆదేశాలతో భారత సైన్యం నిజాం, ఖాసిం రజ్వీ విషయంలో కఠినంగా వ్యవహరించబోతున్నదని తెలిసి అలా కాకుండా అడ్డుకోవడానికి, ఆయనకు వాళ్ళ పై వున్న అభిమానానికి కారణం తరువాయి పేజీలలో వివరించాను). 11.సెప్టెంబరు.1957 న జైలునుంచి విడుదలయ్యాక ఖాసిం రజ్వీ పాకిస్తాన్ కి వెళ్ళిపోయాడు. జైలునుంచి విడుదలైన తరువాత ...సరిగ్గా హైదరాబాద్ సంస్థానానికి విమోచనం లభించిన రోజునే రజ్వీ పాకిస్తాన్ కి వెళ్ళడం మరో విషయం. పాకిస్తాన్ కి వెళ్ళేముందు నిజాం కాలం నాటి ఎం.ఐ.ఎం. అనే రాజకీయ పార్టీకి జీవం పోసి దాన్ని సమర్థుడైన నాయకుడి చేతుల్లో పెట్టి వెళ్ళాలని రజ్వీ నిర్ణయించుకున్నాడు. పార్టీ సభ్యులకు వర్తమానం పంపాడు. ఓ ముప్పై నలభై మంది మాత్రం సమావేశానికి హాజరయ్యారు. కానీ, బాధ్యతల్ని తీసుకోవడానికి ఎవరూ ముందుకు రాలేదు. పన్నెండేళ్ళకు పైబడిన ఏ యువకుడికైనా పార్టీ పగ్గాలను అప్పజెప్పేందుకు సిద్ధంగా వున్నానని రజ్వీ ఆ సమావేశంలో ప్రకటించాడు. అబ్దుల్ వహీద్ ఒవైసీ అనే ఓ పద్దెనిమిదేళ్ళ కుర్రాడు ముందుకొచ్చాడు. అప్పట్లో కనీసం అతనికి పార్టీతో కూడా సంబంధం లేదు. వహీద్ ఒవైసీ ధైర్యాన్ని చూసి అప్పటి నిజాం..ఎం.ఐ.ఎం. పార్టీ అధినేతగా అతని పేరుని ప్రకటించాడు. ఖాసిం రజ్వీ మద్దతు తెలిపాడు. పార్టీ పగ్గాలు ఒవైసీ చేతుల్లోకి వచ్చాయి. నిషేధించిన పార్టీ నాయకత్వాన్ని స్వీకరించిన నేరానికి అతనికి 11 నెలల జైలు శిక్ష విధించారు. జైలు జీవితం ముగిశాక ఒవైసీకి కేంద్రమంత్రి పదవిని ఇచ్చేందుకు నెహ్రూ ముందుకొచ్చాడు. కానీ వహీద్ ఒవైసీ అంగీకరించలేదు. ఎం.ఐ.ఎం.కి నూతన ఉత్తేజాన్ని అందించేందుకు పూర్తి సమయాన్ని వెచ్చించాడు. 1975 లో వహీద్ ఒవైసీ కొడుకు సలావుద్దీన్ ఒవైసీ... తండ్రినుంచి పార్టీ పగ్గాల్ని తీసుకున్నాడు. ఆయన కొడుకులు అసదుద్దీన్, అక్బరుద్దీన్ ఒవైసీలు ప్రస్తుతం పార్టీ బాగోగులు చూస్తున్నారు. హైదరాబాద్ సంస్థానం పతనం తరువాత ప్రముఖులు అయిదుగురిలో నెహ్రూ దయవల్ల నిజాం పరిస్థితి కొంత నయం. 1) మీర్ నిజాం ఉస్మాన్ అలీఖాన్ ని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటైన తరువాత భారత ప్రభుత్వం 'రాజ్ ప్రముఖ్' ని చేసింది. అంటే..గవర్నరు హోదా అన్నమాట 2) రజాకార్లకు నాయకత్వం వహించి అన్యాయంగా హిందువుల ప్రాణాలను పొట్టనబెట్టుకున్న ఖాసిమ్ రజ్వీ పాకిస్తాన్ కి వెళ్ళి, అక్కడ ఎవరూ పట్టించుకోక..కరాచీలో దీనాతిదీనమైన పరిస్థితిలో చనిపోయాడు 3) మీర్ లాయక్ అలీ ఖాన్--నిజాం ప్రభుత్వ దివాన్ -- అందరికన్నా ముందు పాకిస్తాన్ కి వెళ్ళిపోయాడు 4) కే.ఎ.మున్షి-హైదరాబాద్ లో ఇండియా ఏజెంట్ జనరల్ గా వున్న ఇతను నిజాంతో కలిసిపోయి అరాచకాల్ని భారత ప్రభుత్వానికి తెలియకుండా మేనేజ్ చేసిన కారణంగా మట్టిలో కలిసి పోయాడు 5) హైదరాబాద్ సంస్థానానికి మేజర్ జనరల్ సయ్యద్ అహ్మద్ అల్ ఇద్రూస్ చరిత్ర కారాగారంలోనే ముగిసిపోయింది. విడుదలైన తరువాత అనామకుడిగా మిగిలిపోయాడు.......ఇవీ ఎం.ఐ.ఎం పార్టీ/ఒవైసీల మూలాలు

---------------

1946 అగస్టు 16న ముస్లింలీగ్ అధినేత హెచ్.ఎస్.సుహ్రావర్థి బెంగాల్లో పోలీసులను భయపెట్టి హిందువులను చంపేందుకు వందలాది వాహనాల్లో మారణాయుధాలతో హిందువులపై దాడులు చేయించాడు. 10వేలమంది హిందువులను చంపివేసారు. వేలాది హిందువుల దుకాణాలను లూటీ చేసారు. అందుకే దానికి 'గ్రేట్ బెంగాల్ కిల్లింగ్' అన్న పేరు వచ్చింది. ఆనాడు దేశంలో వున్న నాలుగున్నరకోట్లమంది ముస్లింలు కలిసి హిందువులపై దాడులు చేస్తూ, దేశాన్ని అతలాకుతలం చేయాలని ముస్లింలీగ్ భావించింది. ఇప్పుడు ఎమ్.ఐ.ఎమ్. మనస్సులోకూడా ఇదే భావన ఉంది.

ఎమ్.ఐ.ఎమ్. అంటే ముస్లింలకు ప్రాతినిధ్యం వహించే పార్టీ అని భావిస్తూ, ఈ పార్టీ నేతలపై చర్య తీసుకుంటే తమకు ఓట్లు రావనే అభిప్రాయం కాంగ్రెస్ పార్టీకి ఉండటంవల్లే ఎమ్.ఐ.ఎమ్.నేతలు ఏం మాట్లాడినా, ఎలా మాట్లాడినా చర్యలు తీసుకోలేదు. మిగతా పార్టీలూ దీనికి మినహాయింపు కాదు.

-----------

తెలంగాణా విమోచన దినోత్సవాన్ని అధికారికంగా నిర్వహించే దమ్ము అప్పటి కాంగ్రెస్, టీడీపీ లకు, ఇప్పటి టీ.ఆర్.ఎస్.లకు లేదు. అలా చేస్తే ముస్లింల ఓట్లు రావనే భయం అన్ని పార్టీలకు.

భారతదేశంలోని ముస్లింలందరికీ ఎమ్.ఐ.ఎమ్. ప్రతినిధి కాదు, అలానే దేశంలోని హిందువులందరికీ ఆర్.ఎస్.ఎస్., బీ.జే.పీ.లు ప్రతినిధులు కాదు. భారతదేశంలో ఈనాడు ముస్లింలుగా, క్రిస్టియన్లుగా చెలామణి అవుతున్నవాళ్ళలో అత్యధిక భాగం నయానో భయానో మతమార్పిడి చేయబడిన వాళ్ళే. మాజీ-హిందువులే.
-------------

రజాకార్ల సమయంలోను, నిజాంసంస్థానం భారతదేశంలో విలీనము అయ్యేదాకా హిందువుల మీద జరిగిన భయంకరమైన, నీచమైన మతదాడి, ఆ తరువాత అడపాదడపా జరిగిన మతకల్లోలాలు; 1990లోను జరిగినటువంటి రక్తపాతము, ఈ రెండింటికంటే ఎక్కువ స్థాయిలో తెలంగాణా ఉద్యమసమయంలో, తెలంగాణా ఏర్పడిన తర్వాతనూ రక్తపాతము జరుగుతుంది. (మిగతా విషయాలు ప్రక్కన పెడితే, దివంగత ముఖ్యమంత్రి నందమూరి తారకరామారావుగారి పరిపాలనలో హైదరాబాదులో ఎటువంటి మతకల్లోలాలూ జరుగలేదు)

హైదరాబాదు పాతబస్తీ ఏనాడో మజ్లిస్ పార్టీకి పాకిస్తాన్ బ్రాంచి రాజధానిగా, మిని పాకిస్తాన్ గా మారిపోయింది. పాకిస్తాన్ తీవ్రవాదులకు, ఐ.ఎస్.ఐ. ఏజెంట్లకు అడ్డాగా మారింది.
-------------

ఎక్కడో దేశంకాని దేశం డెన్మార్క్ లో మహమ్మద్ ప్రవక్తను మీద ఒకడు ఓ కార్టూన్ వేస్తే ఆ కార్టూన్ వేసినవాడు హిందువు కాకపోయినా హిందువులను టార్గెట్ చేసుకొని హైదరాబాద్ లోని ముస్లింలు చేసిన విధ్వంసకాండను మర్చిపోలేము.
------------

ముస్లింలకు రిజర్వేషన్ల పేరుతో ప్రమాదకరమైన క్రొత్త అంశాన్ని తెరమీదకు తెచ్చాడు తెలంగాణా ముఖ్యమంత్రి కే.సీ.ఆర్. ప్రస్తుత పరిస్థితుల్లో మతపరమైన రిజర్వేషన్లను సుప్రీంకోర్టు ఒప్పుకుంటుందా? ఒప్పుకోకపోతే జరిగే గొడవలు ఊహకు అందనివేమీ కాదు. ఓట్ల రాజకీయంలో కాంగ్రెస్ వాళ్ళను తలదన్నేలా కే.సీ.ఆర్. తయారవుతున్నాడా?

ఒక ముస్లిం పది మంది హిందువులతో సమానమని అరచి పెడబొబ్బలు పెట్టే అక్బరుద్దీన్ లాంటి వాళ్ళు "రిజర్వేషన్ల" కోసం ఎందుకు దేబిరిస్తున్నారు? అక్బరుద్దీన్ లెక్క ప్రకారం దాదాపు 25కోట్లు వున్న ముస్లింలు 250కోట్ల హిందువులతో సమానం కదా? అంత శక్తివంతులైన ముస్లింలు "ముస్లిం మైనార్టీలు అభద్రతకు" లోనవుతున్నారని అనటం ఏమిటి? దేశ జనాభాలో రెండవ స్థానం ఆక్రమిస్తున్న ముస్లింలు మైనార్టీలు ఎలా అవుతారు?
మరియూ, ఇంత శక్తివంతులైన ముస్లింలు, తమ "హజ్ యాత్ర" కోసం ప్రభుత్వం ఇచ్చే దానాలకోసం ఎందుకు క్యూల్లో నిలబడుతున్నారు?
------------------

విద్యుత్ చోరులను గుర్తించటానికి, దశాబ్దం క్రితం, హైదరాబాద్ లోని పాతబస్తీకి వెళ్ళిన విద్యుత్ శాఖ సిబ్బందికి, పోలీసులకు ఎదురైన అనుభవం తెలిసిందే.

దశాబ్దం క్రితం గుంటూరు మసీదులో బాంబ్ ప్రేలితే (పెట్టింది జిహాదీలే) గుంటూరు బస్ స్టాండ్ పరిసర ప్రాంతాల్లో ముస్లిములు చేసిన దాడులు, విధ్వంస కాండ హిందువులు మర్చిపోలేనిది.
--------------

1990 అల్లర్లలో హిందూమతం వారు హైదరాబాద్ లోని పాతబస్తీ మొత్తం ఖాళీ చేసి బయటకు రావల్సిన పరిస్థితి కల్పించారు ముస్లిములు.
------------------------------------------------------

POLICE(Protection Of Life In Civil Establishment)... పోలీసువ్యవస్థ అంటే ప్రజలకు ఏహ్యాభావం వుండొచ్చు. కానీ అక్బరుద్దీన్ లాంటివాళ్ళు మారణహోమాలు సృష్టించకుండా తటపటాయిస్తుంది పోలీసులను చూసే అని ప్రజలు గుర్తించుకోవాలి. రాజకీయ,

స్వప్రయోజనాలకు ఉపయోగించుకోకుండా పోలీసులను వాళ్ళ దోవన వాళ్ళని ఖచ్చితంగా పనిచేసుకోనిస్తే దేశంలో ఇంత అశాంతి వుండేదికాదు. ముఖ్యంగా, హైదరాబాదులో ఏ హిందూ, ముస్లిం పండుగల ఉత్సవాలు జరిగినా వీళ్ళకు ప్రాణాల మీదకు వచ్చినట్లే. భీభత్సకారుల మీద చర్యలు తీసుకున్నా తీసుకోకపోయినా బలిపశువులు వీళ్ళే. వీళ్ళ బలిదానాలు గుర్తించేవాళ్ళు తక్కువ. శుక్రవారం వస్తుందంటే చాలు. హైదరాబాదుతో సహా ముస్లిం ప్రాబల్యం వున్న ప్రాంతాల్లో వున్న పోలీసులు తీవ్రమైన ఒత్తిడికి గురౌతారు. వాళ్ళ బాధలు వర్ణనాతీతం.

ఓ జిహాదీ తీవ్రవాదిని పట్టుకునే సమయంలో ప్రాణాలొదిలిన ఐ.పీ.ఎస్.ఆఫీసరు కృష్ణప్రసాద్ అంతిమక్రియలకు హాజరైన వాళ్ళకంటే, తీవ్రవాది అంతిమక్రియలకు హాజరైనవాళ్ళు చాలా ఎక్కువ. అందులోనూ ప్రముఖ రాజకీయ నాయకులున్నారని వినికిడి. అలాగే, 1990 అల్లర్ల సమయంలో హైదరాబాదులో ఓ అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ పోలీసు(ఈయన హిందువు)ను ఆయన వెంటవున్న ఓ కానిస్టేబులు(ఈయన ముస్లిం) కాల్చి చంపటంతో పోలీసు వ్యవస్థ నివ్వెరపోయింది. కఠినమైన క్రమశిక్షణకు, అంకితభావానికీ మారుపేరై, వైపరీత్యాలు ఎదురైనప్పుడు ప్రాణాలొడ్డైనా ప్రజల్ని రక్షించే పోలీసు వ్యవస్థలోకి మతజాడ్యం ప్రవేశించింది. న్యాయవ్యవస్థలోనూ మతజాడ్యపు ఛాయలు బాగానే కనిపిస్తున్నాయి.

అధికారం పోయి మతిభ్రష్టుడైన ఓ రాజకీయనాయకుడు తెలంగాణా పోలీసులమీద వేసిన అభాండం చూడండి. తెలంగాణా పోలీసులే జిహాదీ వెబ్_సైట్లు నిర్వహిస్తూ, వాటికి ఆకర్షితులైన ముస్లిం యువకులను అరెస్ట్ చేస్తూ టెర్రరిస్టులను పట్టుకున్నామని గొప్పలు చెప్పుకుంటున్నారు తెలంగాణా పోలీసులు అని అన్నాడు. అధికార కాంక్షతో ఎంత దిగజారాడో. ఆధారాలు ఉంటే న్యాయస్థానాలకో, మీడియా ముందో వెల్లడించవచ్చు కదా? దేశభద్రత, సమగ్రత ఏమీ పట్టవు ఇలాంటి నికృష్టులకు.

పోలీసులమీదా, సాయుధదళాల మీదా బురద చల్లటం అనేది రాజకీయాల్లో వున్న, విదేశీ నిధులు పొందే ప్రతి కుహనా సెక్యులరిస్టులకు ఒక ఫ్యాషన్ అయింది.

ఇందిరాగాంధీ దేశంలో ఎమర్జెన్సీ ప్రకటించి, పౌరులకు రాజ్యాంగం ఇచ్చిన జీవించే హక్కు సహా సప్త స్వాతంత్ర్యాలను, ప్రాథమిక హక్కులను రద్దు చేసి, దానిని సమర్థించుకోవటానికి దేశ న్యాయవ్యవస్థలోని కొందరు న్యాయమూర్తులనుంచి నయానా, భయానా అండదండలు సంపాదించింది. ఆ చీకటి రోజుల్లో మొత్తం సుప్రీం న్యాయవ్యవస్థలో ఆదర్శమూర్తిగా నిలిచినది జస్టిస్ హెచ్.ఆర్.ఖన్నా ఒక్కరే. తన సామాజిక బాధ్యతను సత్య ప్రమాణంగా నిర్వర్తించి చరితార్థుడయ్యాడు. అలాంటి వ్యక్తి ఏ.పీ. హైకోర్ట్ లో వున్నట్లు లేదు. ఉంటే, తెలంగాణా రాజకీయనాయకులపైన, అక్బరుద్దీన్ లాంటి వాళ్ళ ప్రకటనలకు తీవ్రంగా స్పందించి వుండేవాడేమో! ఉన్నవాళ్ళు భయపడ్డారా లేక తమ వ్యవస్థ దాకా రాలేదు కాబట్టి మౌనం వహించారా?(ఎప్పుడైనా దేశద్రోహులకు, తీవ్రవాదులకు టార్గెట్ అయ్యేది జవాన్లు,పోలీసులు,ప్రజలు, నాయకులే. న్యాయ వ్యవస్థ జోలికి వెళ్ళిన దాఖలాలు లేవు మరి!)

(న్యాయవ్యవస్థ ఈ మధ్య మరీ దారుణంగా తయారవుతున్నది. ప్రశాంత్ భూషణ్ అనే న్యాయవాది సుప్రీం కోర్టుకు ప్రధాన న్యాయమూర్తులుగా పనిచేసిన 16మందిలో సగంమంది అవినీతిపరులని వ్యాఖ్యానించాడు (ప్రస్తుతం దీనిపై సుప్రీంకోర్టులో కోర్టు ధిక్కార వ్యాజ్యం నడుస్తున్నది). ఏ వ్యవస్థనైనా మేనేజ్ చేయగల అమ్మలు, అయ్యలూ, బాబులున్నారంటాడు ఇంకో పెద్దాయన. చివరికి జడ్జిలను నియమించే విషయంలో కూడా. నిజమే మరి జడ్జిలుగా తన వాళ్ళుంటే భవిష్యత్తులో తన మీద ఏమైనా కేసులు వస్తే సాగతీయటమో, తనకు అనుకూలంగా తీర్పులిప్పించుకోవచ్చు కదా. అధికారంలో వుండగా అవినీతికి పాల్పడిన న్యాయమూర్తులు ఉన్నారు. పదవీ విరమణానంతరం పదవులు ఆశించే వాళ్ళ ప్రవర్తన ప్రజాహితమైనదిగా ఉంటుందని భావించలేం.) ఇలాంటివారుంటే రాబోయే ఉత్పాతాల్ని అడ్డుకోగలరని అనుకుంటామా? లేకపోతే ముందు జాగ్రత్త చర్యలు తీసుకుని మతోన్మాదుల్ని అదుపులో పెట్టేవారు కదా.

ఓ రాజకీయపార్టీ తన అస్థిత్వం నిలబెట్టుకోవడం కోసం 'న్యాయప్రభాకరుడ్ని' 'జయప్రదం'గా మేనేజ్ చేసిందంటారు.

------------------------------------

ఒక పద్ధతి ప్రకారం, హిందువులను రెచ్చగొట్టే విధంగా జరుగుతున్న హిందూ దేవాలయాల ధ్వంసం, దేవాలయాలలో చోరీలు, చివరికి భయంకరమైన మతకలహాలకు దారితీస్తాయి.

కాశ్మీరీ పండిట్లకు పట్టిన గతే సీమాంధ్రులకు తెలంగాణాలో పడుతుంది. తెలంగాణా, ముఖ్యంగా హైదరాబాదు, దాని చుట్టు ప్రక్కల ప్రాంతాలు తీవ్రవాదులకు ముఖ్య స్థావరములౌతాయి.

7.ఇ) బాబ్లీ ప్రోజెక్టు మొదలైన వాటివల్ల నీటికోసం కలహాలు, జన నష్టము. ఆల్మట్టి, బాబ్లీ ప్రాజెక్టులు కడుతున్నప్పుడు మౌనంగా ఉన్నారు. కేంద్ర ప్రభుత్వము జలాల పంపిణీ విషయంలో కఠినంగా వ్యవహరించితే ఉత్పాతము తీవ్రత తగ్గుతుంది.
ఆల్మట్టిలాంటి ప్రోజెక్టులవల్ల నీరు సరిగా లభ్యత కాకపోవడం, చౌడు భూములుగా మారిన కోస్తా భూములు, లాంటివి నీటికోసం పోరాటాలు జరిగేలా చేస్తుంది.

విద్యుత్ కోసం తెలంగాణా,ఆంధ్ర రాష్ట్రాలు ఎవరిష్టమొచ్చినట్లు వాళ్ళు నీళ్ళు వాడుకోవటం తెలిసిందే. ఇలా ఏర్పడిన ఘర్షణల్లో ఒకటి- ఏకంగా నాగార్జునసాగర్ ఆనకట్ట నడినెత్తి మీదే ఇరు రాష్ట్రాల పోలీసులూ ఘర్షణకు దిగటం. టెయిల్-పాండ్ విషయంలోనూ ఇరు రాష్ట్రాల పోలీసులూ మోహరించివున్నారు (20.జూన్.2015 న)
02మే2017 న నాగార్జునసాగర్ డ్యాం వద్ద మళ్ళీ జలవివాదం. డ్యాం మీద మోహరించిన ఇరు రాష్ట్రాల పోలీసులు.

అన్నపూర్ణగా పేరుగాంచిన ఆంధ్రప్రదేశ్ కరువు కాటకాలతో విలవిల్లాడబోతుంది.

ఐదేళ్ళుగా (2013 నుంచి) నాగార్జునసాగర్ ఎడమకాల్వ పరిధిలోని సుమారు మూడు లక్షల ఎకరాల ఆయకట్టు బీడుగా మారింది. గత 30 ఏళ్ళుగా నాగార్జునసాగర్ నీటితో సస్యశ్యామలంగా మారిన ఆయకట్టు నేడు బీడుగా మారిపోతుండటం గమనార్హం.

అక్కడ తెలంగాణా ముఖ్యమంత్రి కే.సీ.ఆర్.-"మిషన్ కాకతీయ" పేరుతో పూడికచేరిన, కబ్జాలకు గురైన చెరువులను పునరుద్ధరిస్తూ సస్యశ్యామలం చేస్తున్నాడు; దశాబ్దాల తరబడి మహారాష్ట్రతో వున్న జలవివాదాల్ని ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో పరిష్కరించుకున్నాడు తెలంగాణా ముఖ్యమంత్రి కే.సీ.ఆర్. ఇక మిగిలింది ఆంధ్ర-తెలంగాణా-కర్నాటక మధ్య వివాదాలు.

ఇక్కడ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు సస్యశ్యామలమైన పొలాలను రాజధాని పేరుతో ధ్వంసం చేస్తున్నాడు. సగటున ఒక ఎకరాకు ఒక పంటకు 30 బస్తాల వరి ధాన్యం పండుతుందనుకుంటే 1,40,000 ఎకరాలకు గాను 42లక్షల బస్తాల ధాన్యం ఉత్పత్తి ఆగిపోయినట్లే. సింగపూర్ లాగా బయటినుంచి కొనుక్కోవాలి ఇక.

దాదాపు ఒక దశాబ్దం క్రితం భారతప్రభుత్వంలోని ఒక పరిశోధనా కేంద్రం వారు, కోస్తాఆంధ్ర తీరాన్ని పరిశోధించి తేల్చినదేంటంటే, విచ్చలవిడిగా బోర్లు త్రవ్వడం, చేపల చెఱువుల మూలంగా సముద్రపు నీరు భూమి అడుగు పొఱల్లోకి చొచ్చుకొని వస్తుందని. త్వరలోనే కోస్తా జిల్లాల్లోని పచ్చటి భూములు చౌడు భూములుగా మారబోతున్నాయని. MPEDA(Marine Products Exports Development Agency) అనే సంస్థ రొయ్యలు, చేపల ఎగుమతులు చూసింది. ఈ సంస్థకు కొంత మంది శాస్త్రవేత్తలు, ఈ చెరువుల వల్ల ఆ భూమే కాక చుట్టు పక్కల భూములు సర్వనాశనమౌతయని మొఱపెట్టుకున్నా పట్టించుకోలేదు ఎవ్వరూ.

అమెరికా-వియత్నాం యుద్ధంలో వియత్నాం భూములను మరుభూములుగా మార్చడానికి, అక్కడి జలాలను విషపూరితం చేయడానికి జీవ, రసాయన, విష ఆయుధాలను 'నరహంతక' అమెరికాకు తయారుచేసి ఇచ్చిన 'నీచచరిత్ర' మోన్ సాంటో ది. వీళ్ళు తయారు చేసే జన్యుమార్పిడి విత్తనాలు మన అభివృద్ధికి పనికి వస్తాయా లేక మన మీదా 'ప్రయోగాలు' చేస్తున్నారా? విజ్ఞతతో మెలగవలసింది మన రైతులే.

8.
శ్రీశ్రీశ్రీ వీరభోగవసంతరాయలవారు తేది.26.12.2011 న పట్టాభిషిక్తులైనారు.
తేది.03.02.2058 నాటికి సమస్త భూమండలం స్వామివారి వశమై మహాపట్టాభిషేకం జరుగుతుంది

జులై,2014 నుండి స్వామివారి గురించి తెలియటం ఎక్కువౌతుంది. స్వామివారు క్రీ.శ.2024 లో స్వయంగా రంగంలోకి దిగుతారు.

ప్రత్యక్షకార్యాచరణలోకి త్వరలోనే దిగబోతున్నాయనిపిస్తుంది. ఈ దేవాలయాల ధ్వంసం ద్వారా ఇప్పటిదాకా 'విజయవాడ'కు వున్న రక్షా కవచం బ్రద్దలైనట్లే.
---------------------

ఇప్పుడు మనము దర్శించుకునేది కనకదుర్గ అమ్మవారి జాతి విగ్రహం. ఆ జాతి విగ్రహం క్రింద, కొండగుహలో 'బంగారు' కనకదుర్గ విగ్రహముంది. కృష్ణ నీరు బంగారు(కనక)దుర్గవిగ్రహము యొక్క ముక్కు పుడక అంటుకుంటుందా లేక అందరికీ కనిపించే జాతి కనకదుర్గ విగ్రహం యొక్క ముక్కుపుడక అంటుకుంటుందో తెలియదు.
బంగారు కనకదుర్గ విగ్రహం చూచినవారు మరుక్షణమే మరణించటమో లేక సర్వసంగ పరిత్యాగమునకు గురై ఆ అమ్మవారి విగ్రహం వెనుక వున్న సొరంగం ద్వారా శ్రీశైల సానువులకెళ్ళి ముక్తి సాధనలో మునిగిపోవటమో జరుగుతుంది.
ఆ బంగారు కనకదుర్గ విగ్రహము, ఆ ప్రక్కనే వున్న నవనిధుల కోసం చాలా ప్రయత్నాలు జరిగాయి.
బ్రహ్మంగారు ప్రస్తావించినట్లు కృష్ణవేణి నీరు కనకదుర్గ అమ్మవారి ముక్కుపోగు అంటుకుంటుంది అంటే, ఆల్మట్టి, శ్రీశైలం, సాగర్ ఆనకట్టలు కొట్టుకుపోయినట్లే. ఆ ప్రవాహపు పరిధిలో జీవరాశి బ్రతికుండటం దాదాపు అసాధ్యం.
ఈ జల ప్రళయాన్ని దృష్టిలో ఉంచుకొని, క్రొద్దిమందినైనా కాపాడితే ఈ ప్రాంతంలో తిరిగి మానవజాతి పునర్వికాసం సాధ్యమౌతుందని, నా గురుదేవులైన శ్రీశ్రీశ్రీ సనారి విశ్వేశ్వరులవారు,తదితరులను ప్రార్థించగా వారు ప్రసాదించిన 'సంజీవని' మొక్కలో ఒక చిన్న భాగము శ్రీగాయత్రీవిశ్వకర్మ దేవాలయ ప్రతిష్ఠా సమయమున పంచముఖ గాయతీవిశ్వకర్మ ((నాలుగు దిక్కులను చూస్తూ నాలుగు ముఖములు, ఐదవ ముఖము ఆకాశమును చూస్తూ వున్న) విగ్రహముల క్రింద నాచేత(పావులూరి శ్రీనివాసాచారి)వుంచబడినది. ఈ దేవాలయములో పార్వతీపరమేశ్వరుల, లక్ష్మీనారాయణుల, సరస్వతీబ్రహ్మల, శచీంద్రుల, సంజ్ఞాభాస్కరుల విగ్రహములు కూడా ప్రతిష్ఠ చేయబడినవి). ఆ విపత్తు సమయంలో ఈ దేవాలయ ప్రాంగణములో వున్న వారు కాపాడబడతారు.
శంకుస్థాపన సమయము నుండి ఇప్పటివరకు, అనేక పర్యాయములు విజయవాడ మరియు పరిసర ప్రాంతములలో భూమి కంపించినప్పటికీ, ఈ దేవాలయ పరిధి(పొలిమేర)ని తాకలేదు.

26.
భారతదేశ ఆర్థిక రాజధానిగా కందిమల్లాయపల్లె విలసిల్లుతుంది.

2020 నుండీ ఖచ్చితమైన అభివృద్ధి గమనించవచ్చు.

27.
కంచికి పడమట కామధేనువు జన్మిస్తుంది.

28.
నవనారసింహ క్షేత్రాలు, యాగంటి, ఆలంపూర్, బెల్లంకొండ, ఆనెగొంది, శ్రీశైలంలలో ఉన్న మహానిధులను తీస్తారు.

ఈ మహానిధులు, శ్రీశ్రీశ్రీ వీరభోగవసంతరాయలవారు లేక ఆయన సేనాధిపతి ఆధ్వర్యంలో తీయబడతాయి. ఇతరులు ప్రయత్నించటం ఆత్మహత్యాసదృశ్యమే.

29.
బాపల పంచాంగములు తలక్రిందులవును. వారు చెప్పే భవిష్యత్తు జరుగకపోగా వ్యతిరేకముగా జరుగును.

దాదాపు రెండు దశాబ్దాలుగా, వ్యక్తిగత జాతకాలనుబట్టి నవగ్రహాలకు ఖచ్చితమైన శాంతులు జరిపినా ఫలితాలు రావటంలేదు. అలాగే, 2004లో జ్యోతిష్యులు చెప్పినది చూడండి. ఆంధ్రప్రదేశ్ లో టీ.డీ.పీ., కేంద్రంలో బీ.జే.పీ. వస్తుందని చాలామంది చెప్పినదానికి వ్యతిరేకంగా జరిగింది (తాచెడ్డ కోతి వనమెల్లా చెరిచిందన్నట్లు .. ఆంధ్రప్రదేశ్ లో చంద్రబాబు ఓడడమేకాక కేంద్రంలో బీ.జే.పీ. కూడా ఓడిపోతుందని నేను చెప్పాను. అలాగే, వై.ఎస్.రాజశేఖరరెడ్డి గారు రెండుసార్లు ముఖ్యమంత్రి అవుతారనీ, రెండవసారి బై-ఎలెక్షను వస్తుందని చెప్పటం జరిగింది. ఇక్కడ బై-ఎలెక్షను అంటే నా ఉద్దేశ్యం ఆయన అకాల మరణం పొందుతారని, తద్వారా ఆయన నియోజకవర్గానికి బై-ఎలెక్షను వస్తుందని). కారణం ఒకటే. యుగసంధిలో వుండటం. ఈ సమయంలో అనుసరించవలసిన గణితపద్ధతి (విశ్వకర్మ జాతకభాగము, మనుబ్రహ్మ జాతకభాగము, రావణబ్రహ్మ జాతకభాగము, సాంద్రసింధువేదము) తెలియకపోవటమే. 09-09-2009 నుండి గ్రహాల ఆగ్రహానుగ్రహాలు

సమస్తం శ్రీ వీరభోగవసంతరాయలవారి ఆధీనంలో వుండబోతున్నాయని తెలిసే మయన్ కేలెండర్ ను అక్కడితో ఆపేసారు. పంచాంగాలు 'తల' 'క్రిందు'లౌను అనే వాక్యం ఇంకోరకంగా కూడా జరిగింది. భారతప్రభుత్వం తాను ప్రకటించే పంచాంగాలలో 2004 నుండి వైశాఖ మాసం మొదటిదిగా చేసింది. 'తల'గా వున్న చైత్ర మాసం 'క్రింది'కి వచ్చి 12వ మాసమైంది.

30.
ఆఱు విచిత్ర వ్యాధులు లక్షలాది మందిని కబళిస్తాయి.

31.
కావేరీ తీరం వెంబడి కలహాలతో లక్షలాదిమంది మరణం.

దాదాపు 1990 నుండీ కావేరీ నది నీటికోసం జరుగుతున్న గొడవలు తెలిసిందే. ఇవి భవిష్యత్తులో మరీ ముదిరి లక్షలమంది చావుకు కారణమౌతుంది.

32.
భయంకరమైన తుఫానులు, వరదలవల్ల పశ్చిమ బెంగాల్, బంగ్లాదేశ్ లలో కోట్లాదిమంది దుర్మరణం. భూకంపంవల్ల కలకత్తా నగరం దెబ్బతింటుంది.

33.
ఒక వైశాఖ అమావాస్య నాడు విచిత్ర వ్యాదులతో అనేకమంది హతమౌతారు (బహుశా జీవ, రసాయన ఆయుధముల వల్ల కావచ్చు)

34.
మక్కా మసీదు లో ఒక పంది ఉద్భవమై, ముస్లిములచే తరుమబడుచూ చివరికి విజయవాడ చేరుతుంది. అప్పుడు జరిగే కలహాలవల్ల లక్షలాది మంది మరణిస్తారు.

జరుగబోయే ఈ సంఘటనకు నాందీగా, 12.01.2006 నాడు, ఇన్ద్రకీలాద్రి పై కొలువున్న కనకదుర్గ అమ్మవారి దేవాలయంలోకి ఒక అడవిపంది జొరబడింది. (గర్భగుడిలోకి ప్రవేశించలేదు)
విజయవాడ ఇప్పటికే జిహాదీలకు 'అజ్ఞాతవాస' కేంద్రంగా తయారయ్యింది. అతిత్వరలో విజయవాడకు ప్రమాదం.

35,
'శని' సంచారం - మీనరాశిలో ఉండగా మ్లేఛ్ఛులకు హాని, వృషభరాశిలొ ఉండగా ఈశాన్య దిశ నుండి వచ్చే విషపుగాలి వల్ల మరణాలు, మిధున రాశిలొ ఉండగా పాపులలో ఎక్కువమంది మరణిస్తారు (తేది.29-03-2025 నుండి 10 సంవత్సరములు పైబడి).

అమెరికా, రోమ్, బ్రిటన్ మొదలగు పశ్చిమ దేశాల సర్వనాశనానికి నాంది.
------------------------------------

చైనాదేశంచే ప్రయోగించబడ్డ జీవ,రసాయన ఆయుధంవల్ల భారతదేశానికి ప్రమాదము.
-----------------------------------

మతయుద్ధం. వాటికన్ సిటీ పై దాడి.
-----------------------------------

36.
ఒక తోక చుక్క వల్ల భూభ్రమణములో మార్పువస్తుంది. సూర్యుడు వణుకుతున్నట్టు కన్పిస్తాడు. తేది.02-08-2027 (సూర్యగ్రహణం) నాడు, సూర్యునిలో సూర్యనారాయణ స్వామి దర్శనమిస్తాడు. ఇంకో సందర్భంలో సూర్యునిలో విష్ణు మూర్తి దర్శనమిస్తాడు. ఇంకో తోక చుక్క 33 రోజులు కన్పిస్తుంది.

37.
తేది.15-03-2035 నాడు శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంతరాయలవారు తమ విశ్వరూపం చూపిస్తారు. తేది.30/03/2035 నాడు శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంతరాయలవారు తన సైన్యంతొ మహాసంగ్రామానికి బయలుదేరుతారు. ఆనంద(2034-35), రాక్షస(2035-36) నామ సంవత్సరములలో పశ్చిమ దేశాలలో కోట్లాదిమంది హతమౌతారు, ఈ సమయంలోనే కలియుగధర్మం నాశనమౌతుంది(దాదాపు).

అమెరికాపై అణుదాడి. అమెరికా దరిద్రదేశంగా తయారవుతుంది.

38.
దాదాపు 400 సంవత్సరముల క్రితం శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి గారిచే బనగానపల్లెలో చింతచెట్టు క్రింద భద్రపరచబడ్డ కాలజ్ఞాన తాళప్రతులు తేది.7/8-06-2036 నాడు శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంతరాయలవారిచే తీయబడి బహిరంగపరచ బడతాయి. ఆనాటి నుండి, వ్యక్తిగత, ప్రపంచ దేశాల భవిష్యత్తుకు సంబంధించి ఎలాంటి సవరణలు లేకుండా కాలజ్ఞానములో వ్రాయబడినట్లు యధాతధంగా జరుగుతాయి.

39.
ప్రపంచవ్యాప్తంగా రెండు మతాల మధ్య యుద్ధంవలన పింగళ (2037-2038), కాళయుక్తి (2038-39) మరియు రౌద్రి(2040-41) లలో కోట్లాదిమంది హతమౌతారు.

40.
కులాంతర, మతాంతర వివాహాలు సర్వసామాన్యం అవుతాయి.

41.
ఉత్తరాయణమందు ఉత్తరభారత దేశస్తులు దక్షిణ భారతావనికి తరలివస్తారు. అప్పుడు జరిగే కలహాలవల్ల కోట్లాదిమంది హతం.

42.
తేది.24-05-2039 నుండి 21-06-2039 మధ్యలో వచ్చే భయంకర భూకంపంవల్ల అద్దంకి(ప్రకాశం జిల్లా) నేల మట్టమౌతుంది.

క్రొద్ది సంవత్సరాలనుండి అద్దంకి పరిసర ప్రాంతాలు తరచుగా భూప్రకంపనలకు లోను కావడం తెలిసిన విషయమే

43.
క్రీ.శ.2040లో 40 రోజులపాటు కాశీ వద్ద గంగానదిలో నీరు ఉండదు.

44.
పండ్రెండు రోజులు గోదావరిలో చుక్కనీరు ఉండదు. 13వరోజున భయంకరమైన వరదలు వస్తాయి.

45.
తేది.15/16-02-2041(రౌద్రి,మాఘ పౌర్ణమి)నాడు ఒక్కసారిగా ఏడు కోట్లమంది దుర్మరణం పాలౌతారు.

46.
తేది 26/27-11-2044(రక్తాక్షి,మార్గశిర శుద్ధ సప్తమి)నాడు, చెన్నపట్నం (మద్రాసు) లో, ఏడేండ్ల బ్రాహ్మణ బాలికకు నాలుగు చేతులు, మూడు కాళ్ళు, నెత్తిన కొమ్ము గల ఒక మగ శిశువు జన్మిస్తాడు. ఆ శిశువు 22 రోజులు జీవించి 23వ రోజున మరణించబోయేముందు, శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంతరాయల వారికి కలి పురుషుడికి మధ్య జరగబోయే మహాయుద్ధం (3వ ప్రపంచయుద్ధం/ది ఆర్మగెడ్డాన్) గురించి ప్రకటన చేసి మరణిస్తాడు. ఈ యుద్ధం 19-01-2045 నుండి 16-02-2045 మధ్య మొదలౌతుంది. యుద్ధాలు పరిసమాప్తి క్రీ.శ. 2060 తో అవుతాయి. ప్రళయాలు క్రీ.శ.2066 దాక కొనసాగుతాయి.

47.
అమెరికాలో ఒక నగరం (బహుశా కాలిఫోర్నియా కావచ్చు)భూకంపంతో నేలమట్టమౌతుంది. ఆ విపత్తునుండి ఐదు కుటుంబాలు మాత్రమే

బ్రతికి బట్టకడతాయి. ఇండో-మయా సంస్కృతి తిరిగి పునరుజ్జీవనమౌతుంది. అమెరికా అతి బీద దేశమౌతుంది.

దాదాపు మూడున్నర దశాబ్దాల క్రితం 'బెర్ముడా ట్రైయాంగిల్' పరిధిలోని ఒక ప్రదేశం వద్ద సముద్రగర్భంలో పిరమిడ్ వంటి ఒక కట్టడాన్ని ఒక దేశానికి చెందిన 'మెరైన్ ఆర్కియాలజిస్టులు' చూచి దానిలోకి ప్రవేశించి, అందులో ఒక పీఠంవంటి కట్టడం మీద బంగారంతో చేసిన రెండు చేతులు, ఆ చేతుల మధ్యలో స్వచ్ఛమైన స్ఫటికంతో చేసిన ఒక కపాలముండటం గమనించి దానిని తమతో తీసుకుపోయారు. ఎన్ని పరీక్షలు చేసినా అతుకు తెలియకుండా బిగించబడ్డ ఆ కపాలం గురించి పెద్దగా విషయాలు తెలియలేదు. కానీ ఆ కపాలం పట్టుకున్న కొందరికి భావరూపకంగా భవిష్యత్తు తెలియటం గమనించారు. (వాళ్ళకు తెలియని విషయం ఏంటంటే, ఇండో-మయన్ జాతివారు ఆ కట్టడాన్ని నిర్మించారని, విశ్వాంతరాళం నుండి వచ్చే విధ్వంసకకిరణాల్ని ఆ కపాలం స్వీకరించి (ఎర్తింగ్ పాయింట్ లాగా) సముద్రం అడుగునున్న భూమిలోకి పంపిస్తుందని). దాన్ని ఒక యూనివర్సిటీలో వుంచారని వినికిడి. అప్పటినుండీ, ఆ ప్రదేశానికి, అక్కడికి దగ్గరలో వున్న ఆ దేశ సముద్రతీరప్రాంతాలకూ భయంకరమైన టోర్నెడోలు, సూపర్ సైక్లోన్ల తాకిడి ఎక్కువైంది.

48.
గోపురము కూలి కుంభుని (కుంభకోణం) రూపు మారుతుంది.

49.
శైవులు వైష్ణవుల మధ్య కలహాలు. బ్రతుకు దుర్భరమై 1,11,000 మంది బ్రహ్మంగారి జీవ సమాధి వద్ద గండకత్తెరలతో తలలు తెగకోసుకుని ఆత్మాహుతి చేసుకుంటారు. ఏఱులై పాఱిన ఆ రక్తం బ్రహ్మంగారి జీవసమాధిని తాకుతుంది. జీవసమాధిని పగులగొట్టుకుని బైటకు వచ్చిన బ్రహ్మంగారు వారిని కాపాడుతారు.

------------------------------

మంగళగిరిలో కొలువైయున్న నరసింహస్వామి క్షేత్రంలో శ్రీకృష్ణునికి సంబంధించి అపురూపమైన వస్తువులు, నిధి బయలుపడతాయి. శ్రీకృష్ణుని ధర్మపత్నియైన రుక్మిణీదేవి, నల చక్రవర్తి ధర్మపత్ని అయిన దమయంతిల జన్మస్థలం కొండవీడు(గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్) అంటారు. వీరు తెలుగువారి ఆడపడుచులు. రుక్మిణీదేవి తరచుగా కొండవీడు(గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్)కు దగ్గరలో కొండమీదయున్న 'మూల గౌరమ్మ (మూలాంకురేశ్వరీదేవి) కు పూజ చేసేది. కాబట్టి శ్రీకృష్ణుని వస్తువులు ఇక్కడ దొరకడంలో ఆశ్చర్యంలేదు. ఆంధ్రప్రదేశ్ రాజధాని 'అమరావతి' మరియూ ఇతర ప్రాజెక్టుల నిర్మాణ సమయంలో ఇవన్నీ ఖచ్చితంగా బయటపడతాయి. అంతేకాక మంగళగిరినుండి అమరావతి (అమరలింగేశ్వరాలయం, బౌద్ధారామం ఉన్నది) దాకా ఎన్నో దేవాలయాలకు సంబంధించి నేలమాళిగలు, వాటిల్లో నిధులూ బయటపడతాయి. పాలకులు వాటిని సద్వినియోగం చేసి చరితార్థులౌతారో లేక దుర్వినియోగం చేసి తమ వంశాలే లేకుండా చేసుకొంటారో కాలమే నిర్ణయిస్తుంది. ఇంకో విషయమేమంటే, శ్రీరాముడి తల్లియైన కౌసల్యాదేవి కూడా తెలుగు వారి ఆడపడుచే.

------------------------------------------------------

బ్రహ్మంగారు తమ జీవసమాధినుండి బయటకు వచ్చే తేది.

50.
అమావాస్యనాడు, ఉదయగిరి పర్వతముమీద, చక్రాంకితుడైన శ్రీమహావిష్ణువు దర్శనమిస్తాడు. సుదర్శన చక్రమును చూసి ప్రజలు ఆ రోజు చంద్రగ్రహణమని భ్రమపడతారు.

51.
క్షిపణి, అణుదాడిలో హంపి (కర్నాటక) దెబ్బతింటుంది.

52.
మాయాజంగాలు (రోబోట్ సైనికులు) వస్తారు.

53.
వెంపలి చెట్లకు నిచ్చెనలు వేసుకుని ఎక్కే ప్రమాణముగల మనుషులు పుడతారు.

54.
ఊరూర పొలిమేర్ల వద్ద తెల్ల కాకులు చేరి ఏడుస్తాయి.

55.
వాలి,సుగ్రీవుల ఖజానా వెలికి తీస్తారు. హనుమద్రామాయణము వెలుగులోకి వస్తుంది.

(హనుమంతులవారిచే వ్రాయబడిన హనుమద్రామాయణము(రామాయణ నిజచరిత్ర), రావణబ్రహ్మ కు సంబంధించిన వస్తువులు శ్రీలంక, మినికాయ్ ద్వీపము, రామేశ్వరము, తిరువనంతపురములకు అనుసంధానించబడ్డ యొక సముద్రగర్భ సొరంగములో వున్నవని ప్రతీతి.)

నేను హనుమద్రామాయణము విన్న తరువాత కొంత కాలానికి శ్రీశైల అరణ్యములో ఒక సిద్ధపురుషుని వద్ద అఱచేయి కొలతవున్న ఒక బంగారు నాణెము చూసాను. దానికి ఓవైపు ఆంజనేయస్వామికి శ్రీరాముడు సీతాలక్ష్మణభరతశతృఘ్నాదులతో నమస్కారం చేస్తున్నట్లుగా ముద్ర వుంది. ఆ నాణెమే రామాంజనేయ యుద్ధానికి కారణము. అలాంటి నాణేములే వాలిసుగ్రీవుల ఖజానాలో భారీయెత్తున బయటపడతాయి.

56.
నాస్తికత్వము ప్రబలుతుంది. వావివరుసలు మరచి ప్రవర్తిస్తారు. ఒకరియాలు మరొకరి పాలగును.

వావివరుసలు మర్చి ప్రవర్తించటం, అఘాయిత్యాలు చేయటం ఈ మధ్య చాలా ఎక్కువైంది.
పెళ్ళి అయినవాళ్ళు తమ భాగస్వామితో మూడుముళ్ళ బంధం తెంచుకొని వేరేవాళ్ళను పెండ్లి చేసుకోవడం ఈ మధ్య ఎక్కువైంది. ఈ మధ్య కాలంలో ఇట్లా జరిగిన వాటిలో సంచలనం కలిగించింది 'ఎన్టీయార్', 'దిగ్విజయ్ సింగ్' ల ప్రేమా, పెండ్లి వ్యవహారం.

57.
ఐదేండ్ల నాగయ్య వేదాలు చదువుతాడు. ఇంకొక బాలుడు ప్రజలకు భవిష్యత్తు చెబుతాడు.

58.
భారతదేశం ముక్కలౌతుంది. వింధ్య పర్వతముల నుండి సేతువు (రామేశ్వరము) మధ్య ప్రదేశము, శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంతరాయల వారి సహాధ్యాయి మరియు దళపతియైన ఒక వీరుని పరిపాలనలో ఉంటుంది (సామంత రాజ్యముగా).

59.
వేంకటేశ్వరుని కుడిభుజము అదురును, విగ్రహము పగుళ్ళిస్తుంది, తిరుమలలో భూకంపము వస్తుంది. తిరుమలకు వెళ్ళే రహదారులన్నీ మూసుకు పోతాయి.

60.
పుష్యమాసములో మ్లేచ్ఛదేశాలకు హాని.

61.
తేదీ.26-08-2054(భావ,శ్రావణ,బహుళ అష్టమి) నాడు, నదీనదములు పొంగి పల్లెలు, పట్నాలు దెబ్బతింటాయి.

62.
జులై-ఆగష్టు,2055 మధ్య ఒక ఆదివారమునాడు, తిరునల్వేలి వద్ద పండుగ జరుగుతూండగా, అకస్మాత్తుగ వరదలొచ్చి వేలకొద్దీ జనం దుర్మరణం పాలౌతారు.

63.
ధాత(2056-57)నామ సంవత్సరము వచ్చేప్పటికి వైశ్యులలో 25 గోత్రాలవారు మాత్రమే మిగులుతారు.
---------------------------------------

ఆ ఇరవైఐదు గోత్రాలు

---------------------------------------

యుగాలనుండీ, భరతఖండములోని రాజ్యాలకు, హైందవ సంస్కృతికీ, దేశ ఆర్థిక వ్యవస్థకు మూలస్థంభాలు వైశ్యులు. ఆర్థికంగానే కాక, సామాజికంగాను వీరి పాత్ర గొప్పది. వైశ్యులలో 25 గోత్రాలవాళ్ళే మిగులుతారంటే భారత ఆర్థికవ్యవస్థకు పట్టుకొమ్మలైన వీరి మీద ఎంత భయంకరమైన స్థాయిలో హిందూయేతర మతస్థుల దాడి జరుగుతుందో ఊహించుకోవచ్చు. (గ్రామాల్లో వర్గవైషమ్యాలున్నా వీరికి అందరితో సత్సంబంధాలుండేవి. వైషమ్యాలు తొలగటానికి ఒక్కోసారి వీరే అనుసంధానకర్తలుగా వుండేవారనుకోవచ్చు) దీనికి నాందీగా, సోనియా గాంధీ ఆధ్వర్యంలోని ప్రభుత్వం, రిటైల్ మార్కెట్లోకి బహుళజాతి సంస్థలకు అనుమతినిచ్చింది. ఇటీవలనే భారతదేశంలోకి అడుగుపెట్టిన బహుళజాతి సంస్థ 'వాల్_మార్ట్'. అధికారికంగా తెలంగాణాలో ఏప్రిల్,2017 లో అడుగు పెట్టింది. వాళ్ళ మూలకంగా చిరు వ్యాపారులు సర్వనాశనం కాబోతున్నారు.

64.
తేదీ.03-02-2058(ఈశ్వర,మాఘ,శు.దశమి) నాటికి అన్ని దేశాలు శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంత రాయలవారి వశమౌతాయి. ఆ తేది నుండి సమస్త భూమండలాన్నీ శ్రీశ్రీశ్రీ స్వామివారు 108 సంవత్సరములు పరిపాలిస్తారు. శ్రీవారి వారసులు వెయ్యి ఏండ్లు పరిపాలిస్తారు.

65.
బహుధాన్య(2058-59)లో 25 పట్టణాలలో రక్తపాతం. అంతర్గత కలహాలు, విపత్తులు.

66.
పార్థివ(2065-66)లో కర్నూలుకు ఉత్తరాన ఒక దేవాలయములో వున్న వేపచెట్టుకు నెల రోజులు పూజ చేస్తారు. ఆ తర్వాత ఆ చెట్టునుండి వచ్చే విషపు గాలివల్ల వేలాదిమంది మరణిస్తారు.

పార్థివ (2005-2006)లో మధ్య, ఉత్తరభారతంలో విజృంభించిన వైరస్ వల్ల ఎన్నో జీవాలు(కోళ్ళు, వగైరాలు) నశించాయి.

67.
నైతిక విలువలు మృగ్యమౌతాయి. విశృంఖలత పెరుగుతుంది.

హైటెక్ పుణ్యమాని పబ్బుల సంస్కృతి బాగాపెరిగింది. ఇంగ్లీష్ చదువుల మూలంగా భారత సంస్కృతి, నైతిక విలువలు ధ్వంసమౌతున్నాయి.

68.
గోల్కొండ వద్ద గోవిందాపురములో ఒక ఆవు మనిషికి జన్మనిస్తుంది.

ఈ సంఘటన హైదరాబాదుకు జరుగబోయే చివరి అణుప్రమాదాన్ని సూచిస్తుంది.

69.
బ్రాహ్మణులు సేవకా వృత్తితో జీవిస్తారు.

70.
విశ్వబ్రాహ్మణులతో వచ్చిన ఒక వ్యాజ్యములో బ్రాహ్మణులు ఓడిపోతారు

ప్రధమ సత్కారార్హత, దేవాలయ ప్రతిష్ట, ప్రధమ అర్చకార్హత మొదలగునవి విశ్వబ్రాహ్మణులకేనని/విశ్వకర్మబ్రాహ్మణులకేనని కోర్టులు తీర్పునిచ్చాయి. చిత్తూరు జిల్లా అదాలతు కోర్టు తీర్పు మొదలైనవి

71.
వన్యజీవులు ఊళ్ళ మీద పడి భీభత్సం సృష్టిస్తాయి.

72.
రెండు బంగారు హంసలు ఊరూరా తిరుగుతాయి. వాటిని పట్టుకోవాలని చూసిన వారు అంధులౌతారు.

73.
ఏనుగంత సైజులో ఉన్న ఎఱ్ఱ చీమలు భూమిమీద తిరుగుతాయి.

74.
పంది కడుపున ఏనుగు జన్మిస్తుంది.

75.
కొండపగిలి నిలువ నీడ లేక కనకదుర్గ కందిమల్లాయపల్లె చేరుతుంది.

76.
అంగడిలో సరస్వతిని అమ్ముతారు.

ప్రశ్నపత్రాలు 'లీక్' చేసి అమ్ముకోవటం, నకిలీ సర్టిఫికెట్లు అమ్మడం వగైరాలు తెలిసిందే. అలాగే కార్పొరేట్ కళాశాలల విషయం తెలిసిందే. పొట్ట కోస్తే రెండు అక్షరాలు కనిపించవు ఒక్కోడికి. దొంగ సర్టిఫికెట్లు కొనుక్కొని ఉద్యోగాలు చేసేవారు, ఏకంగా మినిస్టర్లు గానూ, డాక్టర్లుగానూ చెలామణి అయ్యేవాళ్ళ గురించి పేపర్లలో చూస్తూనే వున్నాం. డాక్టొరేట్లు, అవార్డులూ తీసుకున్నవాళ్ళూ వున్నారు.
2014 లొ చంద్రబాబునాయుడు గారి ప్రభుత్వం ప్రమాణ స్వీకార సమయంలో మంత్రులుగా ప్రమాణ స్వీకారం చేసినవారిలో కొందరి మాటలు చూడండి. "భారతదేశ సార్వభౌమాధికారము" అని పలకటం చేతగాని వాచభ్రష్టులు మన మంత్రులు. మన దరిద్రం ఏంటంటే, వీళ్ళలో ఒకడైన "నారాయణ" ఎన్నో విద్యా సంస్థలకు అధిపతి. ఏది ఏమైనా "అధిక విద్యావంతులు అప్రయోజకులైరి. పూర్ణ శుంఠలు పూజ్యులైరి అనే నానుడి గుర్తొస్తుంది.
ఇక తెలుగు భాష లో "ఞ,ఞా" అనే అక్షరాలు తీసేసారు. ఏ భ్రష్టులు దీనికి కారణమో తెలియదు. ఈ అక్షరాలు వుంటే వాళ్ళకు, విద్యార్ధులకు వచ్చిన నష్టమేంటో, ఆ అక్షరాలు తీసేసినందువల్ల కలిగిన లాభమేంటో ఆ భ్రష్టులకే తెలియాలి
తెలుగు భాష సంపూర్ణమైన భాష. ఇందులో ప్రతి అక్షరమూ బీజాక్షరమే. ఉదా: 1) ఓం ప్రధమంగా మనం గణపతికి పూజ చేస్తాము. ఆయన మన్త్రము 'గ' తో వుంటుంది (ఓం గం గణాధిపతయే నమ:) 2) అణిమాద్యష్టసిద్ధులలో మొదటిదైన అణిమా సిద్ధి మన్త్రము "అం" అనే అక్షరంతో మొదలౌతుంది 3) శ్రీ రుద్ర చమకమ్ లో (ద్వితీయోఽనువాక:) చివరలో .... సుపథం చ మ ఋద్ధం చ మ ఋద్ధిశ్చ మే క్లృప్తం చ మే క్లృప్తిశ్చమే మతిశ్చ మే సుమతిశ్చ మే .. అని వుంటుంది. వీరి సవరణ ల ప్రకారం క్ల బదులు క్లు అని చదవాలా? 3) కలియుగంలో కలి బాధలనుండి తప్పించుకోవటానికి భైరవ మన్త్రాలు చదవమంటారు. అష్టభైరవుల మన్త్రాలలో ఉన్మత్తభైరవుడి మన్త్రము "ఞ" అనే అక్షరంతో మొదలౌతుంది.
త్రేతాయుగం నాటికే తెలుగు భాష వుంది (తెలుగుకు వ్యాకరణం వ్రాసిన వాళ్ళలో ఒకడు రావణబ్రహ్మ). ఈ భ్రష్టుల మూలంగా తెలుగు భాష చావబోతుందా?
**రెండువేల సంవత్సరాలకు పైగా సాహిత్య సంపద, గ్రంధాలు కలిగివున్న భాషకు మాత్రమే ప్రాచీన హోదా ఉంటుందనీ, తెలుగు భాషకు అవి లేవు కాబట్టి ప్రాచీన హోదా రద్దు చేయాలని ఈ మధ్యనే ఓ పెద్దాయన మద్రాసు హైకోర్టులో వ్యాజ్యం వేసాడు. తెలుగు భాషకు ఈ పరిస్థితి రావటానికి కారణాలలో ఒకటి కొందరు 'అనువాదకవి' నన్నయ్యను 'ఆదికవి'ని చేయటం. దీని మూలంగా నన్నయ్యకు ముందు సాహిత్యం లేదనే వాదన వచ్చింది. నన్నయ్యకు ముందు సాహిత్యం లేదా? ఉంది. నన్నయ్య కంటే ముందే భారతాన్ని ఆంధ్రీకరించిన ఘనత 'అధర్వణాచార్యుడి'ది. అధర్వణుడి భారతాన్నే కాదు-వేములవాడ భీమకవి రచించిన**

**'రాఘవపాండవీయము'ను కూడా నన్నయ్య తగలబెట్టాడని 'అప్పకవీయము'న ఉన్నది. నన్నయ్య లాంటివాడే ఆంధ్రభాషకు ద్రోహం చేసాడు. వాడి వారసులు దీన్ని మృతభాషగా చేస్తున్నారు.**

77.
సముద్రములు కలుషితమై జలచరములు చాలామటుకు నశిస్తాయి.

78
అహోబిళములోనున్న ఉక్కు స్తంభమునకు సన్నజాజులు పూస్తాయి.

79.
పరుశురాములవారి, ఆచార్యా నాగార్జునులవారి, సనారీవారి, అమరలింగేశ్వరస్వామివారి మరియు క్రొందరు సిద్ధపురుషుల ప్రియశిష్యుడైన వ్యక్తి భారతదేశము యొక్క అప్పులు తీర్చి, నదీనదములను అనుసంధానము చేసి సస్యశ్యామలము చేస్తాడు.

80.
మూడవ ప్రపంచయుద్ధం ముగిసేనాటికి ఏడు ఊర్లకు ఒక ఊరు మిగులుతుంది.

81.
తేది.09-04-2005(ఉగాది,పార్థివ)నుండే శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంతరాయల వారు తుది తీర్పులు ఇవ్వడం మొదలుబెట్టినారు.

భగవంతుడి తుది హెచ్చరికలు వినని మానవజాతికి శాస్తి జరగవలసిందే

అవశ్య మనుభోక్తవ్యమ్ కృతంకర్మశుభాశుభం.

82.
కాలజ్ఞాన గోవిందవాక్యము 19 ప్రకారము శ్రీ ఆల్లూరి సీతారామరాజు (శ్రీ అల్లూరి శ్రీరామ రాజు)బ్రిటీషువారిచే చంపబడలేదు.
అదృశ్యుడైనట్లు మాత్రమే వుంది.

రవి అస్తమించని సామ్రాజ్యంగా చెప్పబడిన బ్రిటీషు సామ్రాజ్యాన్ని, నెత్తురు మరిగే పౌరుషంతో అవక్ర పరాక్రమంతో ఎదుర్కొని సింహంలా పోరాడి ఎన్నో యుద్ధాల్లో కాకలు తీరిన బ్రిటీష్ సేనల్ని తద్వారా బ్రిటిషు సామ్రాజ్యాన్ని గడగడలాడించిన మహావీరుడు శ్రీ అల్లూరి సీతారామరాజు (అల్లూరి శ్రీరామరాజు)గారు తేది.4 సెప్టెంబరు,1996 న 'కోస్తా ఆంధ్ర' ప్రాంతంలో కాలధర్మం చెందారు/జీవసమాధిలోకి వెళ్ళారు (ఎంత బ్రతిమలాడినా శ్రీ రాజు గారి బంధువులు వివరణ ఇవ్వలేదు). మరి శ్రీ అల్లూరి శ్రీరామరాజు బదులు ప్రాణత్యాగం చేసిందెవరు? బ్రిటీష్ వారిచే చంపబడ్డాడు అని, అల్లూరి శ్రీరామరాజు గారి ఫొటో అని మనం చూస్తున్నదెవరి ఫొటో? .. అల్లూరి శ్రీరామరాజు గారికి అత్యంత సన్నిహితుడూ, ఆయన ఆత్మాహుతిదళ సభ్యుడైన శ్రీ మండా నరసింహారావు(నరసింహాచారి) గారు ఆల్లూరి బదులు ప్రాణత్యాగం చేసాడు. అల్లూరి బదులు చంపబడ్డ నరసింహాచారిగారి ఫొటోనే మనం అల్లూరిది అనుకొంటున్నాము. శ్రీ నరసింహారావు(నరసింహాచారి) గారు ' కృష్ణదేవిపేట/నిడదవోలు'కు చెందిన విశ్వబ్రాహ్మణుడు/విశ్వకర్మబ్రాహ్మణుడు.
అంతేకాదు, శ్రీ అల్లూరిగారి అతి దగ్గరి బంధువుల ప్రకారం, శ్రీ అల్లూరిగారితో ఒక పెంపుడు చిరుతపులి వుండేది. ఆ చిరుతపులి పేరు 'సీత'. ఆయన జీవితంలో 'సీత' అనే స్త్రీమూర్తి ప్రియురాలుగా కానీ భార్యగాగానీ లేదు. చివరిదాకా బ్రహ్మచర్యంతోనే వుండిపోయారు.

శ్రీ అల్లూరి శ్రీరామరాజు గారి అదృశ్యం వెనుక కారణాలెన్నో. కాకలు తీరి, ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన బ్రిటీష్ సేనానులు కవర్డ్, హైటర్లు యుద్ధంలో శ్రీ అల్లూరి శ్రీరామరాజుగారి చేతిలోనో లేక ఆయన సైన్యం చేతిలోనో చావడాన్ని జీర్ణించుకోలేక మన్యంలో భయంకరమైన నరమేధానికి సిద్ధపడ్డ బ్రిటీషువాడి నరహంతక రాజకీయం ఒక ఎత్తైతే, స్థానిక నికృష్టుల రాజకీయం మరో ఎత్తు.

ఈ నికృష్టుల్లో ముఖ్యులు: 'తుని'కాకుకున్న గుణం కుడా లేని వాడు ఒకడు, 'గాజు'పూస ఖరీదు చేయని వాడు మరొకడు. వీళ్ళు వాళ్ళ వైభవాన్ని కాపాడుకోవటానికి బ్రిటీషువాడికి కట్టుబానిసలై భరతమాతకు ఎనలేని ద్రోహంచేసారు.

భరతమాతను బ్రిటీషువాడి కబంధ హస్తాలనుండి విడిపించాలని సమరం చేస్తున్న శ్రీ అల్లూరి శ్రీరామరాజుగారిని 'బందిపోటు'గా చిత్రీకరించినవాడు ఆభిజాత్యపు దురహంకారి 'టంగుటూరి ప్రకాశం' (బ్రిటీషువాడి తుపాకులకు ఎదురునిల్చొని 'దమ్ముంటే కాల్చండిరా' అని అన్నది స్వాతంత్రోద్యమ కార్యకర్తలనీ, ఈయన అక్కడకు క్రొద్ది దూరంలో వున్నాడనే వాదం వుంది). యుద్ధవివరాలు బాగా తెలిసినా 'అజ్ఞాని'గా 'దివాంధు'డిగా వున్నవాడు భోగరాజు పట్టాభిసీతారామయ్య. వీళ్ళకెవరికీ శ్రీ అల్లూరి శ్రీరామరాజుగారు మహావీరుడిగా, స్వాతంత్ర్య సమరయోధుడిగా కీర్తించబడడం ఇష్టంలేదు. గట్టిగా మాట్లాడితే 'ఆంధ్రప్రదేశ్'ను పరిపాలించిన ఏ ప్రభుత్వానికీ ఇష్టం లేదు.

చివరివాళ్ళు: గాంధీ, నెహ్రూ, వగైరాలు. పరాయివాడి భార్యతో ప్రేమాయణం నడిపి 'ఆత్మబంధ'మన్న ఈ సత్యవంతుడు తన 'ఆత్మకధ'లో ఈ విషయం పేర్కొన్న దాఖలాలు లేవు. అలానే, బ్రిటీషువాడితో జరిగిన ఒప్పందాల గురించి ఏనాడూ సత్యం పలుకలేదు. భారతదేశానికి స్వతంత్ర్యం ఇచ్చిన తరువాత 'నేతాజీ సుభాష్ చంద్రబోస్, మేజర్ జైపాల్ సింగ్, అల్లూరి శ్రీరామరాజు లాంటివాళ్ళ ఆచూకీ దొరికితే, వాళ్ళను బ్రిటీష్ వాడికి అప్పచెప్పాలనే ఒప్పందం మీద గాంధీ, నెహ్రూలు సంతకాలు చేసారట.

అల్లూరి శ్రీరామరాజుగారు బ్రిటీష్ వాడికి ఎదురొడ్డి నిలువడమేకాదు, మన్యం ప్రాంతంలో బలవంతపు మతమార్పిడిని కూడా అడ్డుకున్నాడు. క్రిస్టియన్ మతంలోకి మారకపోతే కేసులు పెడతామని బెదిరించే క్రిశ్టియన్ ఫాదర్లనుండి మన్యప్రజలను కాపాడాడు. కాగా, నేడు మన్యం దాదాపుగా క్రిస్టియన్ కబంధ హస్తాల్లోకి పోవడం దురదృష్టకరం.

83

ఉల్లిగడ్డకు ఉపదేశమిచ్చేటి
కల్లగురువులు కలిని వుండేరుమా
కల్ల గురువుల నెల్ల కాలదన్నును యముడు
కల్లలేని నరుల కరుణించేనిమా

శ్లో. చతుర్వేదధరో విప్ర: సూక్ష్మబ్రహ్మ నవిద్యతే
వేదభారే భరాక్రాన్తం సదైవ బ్రాహ్మణ గార్ధభమ్.
సకలమైన చదువులు పుస్తకములు చదివి ఆ రహస్యమును గుర్తెరుగక యేలాగంటే గాడిద గంధపు చెక్కలు మోసి పరిమళము గుర్తెరుగనట్లు అని తెలిసేది.ఇప్పుడు పున్నమ దృష్టిచేత పరంజ్యోతి గనబడును. ఈ రాజయోగముచే సాధించే సత్పురుషులకు 5 సంవత్సరములకు నిర్మల దర్శనుడగును గాని ఈలోగా కాదు. త్వరగా అగుపరచుకొనేది యేలాగంటే బహుదిక్కుల విచారించి 'కార్యగురువు' కాకుండా 'కారణగురువు'ను కనుగొని 'త్రికారణ వంచన' లేకుండా నాలుగు విధాల శుశ్రూష చేస్తే వారికి కటాక్షము వచ్చి కానరాని పరమాత్మను రాజయోగానుభవముచేత అరక్షణములో కనబరచును. అనేక కాలం ప్రయాసపడితేగాని కనబడని పరమాత్మ అర్ధక్షణం కనబడును అంటే సమ్మతి.

ప్రాప్తే జ్ఞానేన విజ్ఞానం ధ్యాయతే హృది సంస్థితే లబ్దశాంతి ఫలే దేహి నయోగో నచధారణ:
గురుసేవజేసిన వారికి యోగం అక్కరలేదు. ధారణ అక్కరలేదు. (జీవైక్యబోధ - బ్రహ్మంగారు)

బ్రహ్మవిద్యా ప్రచారానికి వచ్చిన సిద్ధపురుషులు/కారణగురువులు శిష్యులను/ప్రజలను ఆకర్షించటానికి తమ శక్తిని ప్రయోగించి లేదా యోగ, తంత్ర పద్ధతులతో జనాలయొక్క కఠినాతికఠినమైన జబ్బులను నయం చేస్తారు. ఒక్కోసారి శిష్యుల గండాలు గురువుల మీదుగా దాటిపోతాయి (అలా చేయటం ప్రకృతి నియమాలను తలకిందులు చేసే ప్రయత్నమేనని దాని ఫలితం భయానకమని తెలిసికూడా, ఆ ఫలితాల్ని గురువులే భరిస్తారు). ఆ తరువాత నియమావళిని ఏర్పరిచి అందరికీ అందుబాటులో వుంచుతారు. ( ఇక్కడ ఒక విషయం ప్రస్తావించవలసివుంది. సాధారణంగా ప్రతి వ్యక్తి జీవితంలోనూ మూడు గండాలు వుంటాయి. మొదటి రెండు గండాలూ తప్పించుకోవటానికి అవకాశం వుంది. మూడవ గండం తప్పించుకోవటం దాదాపు అసాధ్యం. కేవలం సిద్ధపురుషులు మాత్రమే మూడవ గండాన్ని తప్పించగలరు. జ్యోతిష, సాముద్రిక, మంత్ర యంత్ర తంత్రాదులలో నిష్ణాతుడైన మహనీయుడు ఏ వ్యక్తికైనా ఆగామి,ప్రారబ్ద,సంచితాలు పరిశీలించి మొదటి రెండు గండాలూ తప్పించగలడు. ( అయితే, ఈ గండాల్ని తొలగించగల సామర్ధ్యం ఉన్న మహనీయుడు తటస్థించి గండాలు తొలగిపోయే విధానము చెప్పి చేసుకోమన్నప్పుడు గ్రహాలు అడ్డుకుంటాయి పరిహారాలు చేసుకోకుండా, లేక ఆయనే ఆ కర్మగ్రస్తుడి యొక్క గండాల్ని తొలగించటానికి సిద్ధపడినప్పుడు ఆ మహనీయుడిని కలువకుండా అనేకరకాల అడ్డంకులు సృష్టిస్తాయి. )

గురువు మాట మీద విశ్వాసం ఉంచి, ఆయన మీద భరోసా ఉంచిన శిష్యుడు ఎన్నడూ విపత్తును ఎదుర్కొనవలసిన అవసరం పడదు. శిష్యుడు ఏదీ అడగవలసిన అవసరం కూడా రాదు. దేనివల్ల శిష్యుడికి మేలు జరుగుతుందో దానినే గురువు సమకూరుస్తాడు. ( ఇక్కడ గురుశిష్యుల సంబంధానికి మర్కటకిశోర న్యాయం వర్తిస్తుంది. తను ఒక స్థాయికి వచ్చేదాక పిల్లకోతి తల్లికోతిని ఎలా గట్టిగా పట్టుకొని వుంటుందో అలా శిష్యుడు తన గురువును విడువకుండా వుండాలి. ఆ తరువాత కిశోర న్యాయం వర్తిస్తుంది. పిల్లి తన పిల్లల్ని ఎలా కాపాడుకుంటుందో అలా గురువు తన శిష్యుడిని కాపాడుకుంటాడు)

84
దాసులు యోగులు ధరలోన దాగేరు
మోస దాసులు భోగులు మించేరుమా

భగవంతుడి తుది హెచ్చరికలు ప్రజలకు అనేక మార్గాల ద్వారా తెలిసింది. ఏదో కొద్దిమంది తప్ప మిగతావాళ్ళు పట్టించుకోకపోగా ప్రచారకులను అవహేళనచేస్తారు. సభ్యసమాజంలో వున్న సిద్ధపురుషులందరూ, ఒకరి తరువాత ఒకరిగా, వెనుతిరిగి అడవులలోకి, గుహలలోకి వెళ్ళిపోవటం డిసెంబరు,2012 తోనే మొదలైంది. మహాసంగ్రామం మొదలైన తరువాత లేక ఈలోగా, స్వార్థపరులు, ఆర్థికసంబంధాలతోనే ఆధారంగా వున్నవారు ఈ ఉత్పాతాలను తట్టుకోలేక రక్షించేవాళ్ళు కనపడక ఆర్తితో పిలిచినా, అలమటించినా ఏ సిద్ధపురుషుడూ కలుగచేసుకోడు.

భక్తిని వ్యాపారంగా మార్చినవారు, మోసముగా ప్రవర్తించేవారు భోగలాలసతతో వుంటారు.

కొంతమంది దొంగ స్వామీజీల వైభోగము తెలిసినదే

85
యల్లమ్మ కంచును మల్లమ్మ కంచును
కల్లు మాంసము పెట్టి కుడిచేరుమా
కల్ల దేవతలను కొలిచేటివారెల్ల
నిల్వ పేరు లేక పొయ్యేరుమా
-----------------------

దక్షిణాచారం ప్రకారం నైవేద్యంగా దేవతలకు ఇష్టమైన పూలు, పళ్ళు వంటివి ఉపయోగిస్తూ సాధన చేస్తారు. మరియూ అన్నం, కుంకుమతో కలిపిన అన్నం, కూష్మాండ(గుమ్మడికాయ) బలి, లేదా నారికేళ బలి, నిమ్మకాయలు, కుంకుమ కలిపిన గారెలు వగైరాలు దేవతా ప్రీతికోసం బలిగా నివేదిస్తారు. వామాచారం ప్రకారము పంచ మకారాలతో మద్య మాంసము లు నైవేద్యంగా పెడతారు. వామాచారం ప్రకారము పంచ మకారాలతో (మద్య, మాంస, మత్స్య, ముద్ర, మైధునం) సాధన చేస్తారు. అంతేకాదు, ఇటీవలిదాకా శ్రీశైలంలోని భ్రమరాంబా అమ్మవారికి బలి ఇచ్చేవారు. ఇప్పటికీ చాలాచోట్ల పోలేరమ్మవారికి, ఇతర గ్రామ దేవతలకూ, కోళ్ళు, పోతుల్నీ బలి ఇవ్వటం జరుగుతూనే వుంది. కాశీ, ఉజ్జయిని, చాలాచోట్ల కాలభైరవులవారికి, వీరభద్రులవారికి వామాచారపరంగా మద్యమాంసాలు నైవేద్యంగా పెడుతూనే వున్నారు.
----------------------------

వైదిక యుగంలో సాధనామార్గాలు రెండు వుంటూండేవి.

ఒకటి - వాసనను వేళ్ళతో సహా పెళ్ళగించి విసిరిపారెయ్యడం. ఇది మునిసంప్రదాయంలో, లేదా ఊర్ధ్వరేతస్కులైన సన్యాసులు సాధన చేస్తారు.

"ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై మనోవవే.. సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వసంభవం..

జపతపాదులద్వారా కుండలినిని జాగృతి చేసినప్పుడు రేతస్సు ఊర్ధ్వగతిచెంది సహస్రారాన్ని చేరుతుంది. సమాధిస్థితి, సవికల్పసమాధిస్థితి, పూర్ణసమాధిస్థితి, నిర్వికల్పసమాధిస్థితి ఒకదానితరువాత ఒకటి సిద్ధిస్తాయి.

అయితే, సాధారణంగా అధోరేతమునకు (సంభోగం ద్వారా రేతస్సు స్కలనం) అలవాటుపడ్డ మానవుడు ఊర్ధ్వ, అధోరేతముల మధ్య సంఘర్షణకు గురౌతాడు. ఊర్ధ్వరేతస్కుడు మహనీయుడౌతాడు. సాధారణ అధోరేతస్కుడు సామాన్యుడుగా మిగిలిపోతాడు (చాలామంది స్వామీజీలూ, బాబాలూ ఊర్ధ్వరేత సాధనలో విఫలమై స్త్రీలవెంటపడి పతనమైపోయిన సంగతి తెలుస్తున్నదే). ఇక్కడ మినహాయింపు ఏమిటంటే, పరిపూర్ణమైన సంభోగంద్వారాకూడా సమాధిస్థితిని పొందవచ్చు ( ఆ స్థితిని ఎలా చేరుకోవచ్చో తెలిపే శిల్పాలు (మిడిమిడి జ్ఞానులు వాటిని బూతు బొమ్మలుగా అభివర్ణిస్తుంటారు), పద్ధతులు శాసనాలుగా చాలా దేవాలయాలమీద చూడవచ్చు) మరియూ తంత్రసాధనలో మానవస్త్రీతోనూ సాధించవచ్చు.

ఈ విషయం సంపూర్ణంగా, సవ్యంగా అర్ధంకాకపోతే, సంభోగకేళితోనే వ్యక్తి జీవితం బంధించబడి, అదే పరమావధి అనుకుని, భోగలాలసులై అనంతంగా అందులోనే జన్మిస్తూ - మరణిస్తూ ఆ జనన-మరణ చక్రంలో ఇరుక్కుపోతారు.

రెండు- నారీస్వభావంలోని వికారాన్ని శుద్ధిచేసి దాన్ని పూజించ (గౌరవించ)దగినదిగా చేసి ఇల్లు వెలుగొందేటట్లు చెయ్యడం.

దీని వాస్తవిక రూపపరికల్పన మనకు మనువు చేసిన చతురాశ్రమ, దశకర్మాదుల ద్వారా లభ్యమవుతుంది. మనుస్మృతి ఆదర్శం ఇది - త్యాగంమీదా, ప్రేమమీదా ఆధారపడిన సంపత్తితో ఇల్లు గడుపుకోవడం; అంటే ఆదర్శగృహస్తుడు కావడం.
---------------------------------

తంత్రంలో సాధనాక్రియలు మూడు విధాలుగా వుంటాయి. పశుభావం, వీరభావం, దివ్యభావం. తంత్రక్రియలో పంచముండ (రెండు చాండాలమయినవి, మూడవది నక్కది, నాలుగోది పాముది, చివరది కోతిది) శవాసనంమీద పంచవటి (రావి, మఱ్ఱి, మారేడు, నిమ్మ, మేడి చెట్లు) క్రింద పంచమకారాలతో (మద్యం, మాంసం, మత్స్యం, ముద్ర, మైధునం) షట్కర్మలను (మారణం, ఉఛ్చాటనం, వశీకరణం, స్తంభనం, విద్వేషణం, స్వస్త్యాయనం) యంత్ర, మంత్ర, న్యాస, జపాల సహాయంతో సాధన చెయ్యవలసి వుంటుంది. నాలుగు వైపులా భోగసామాగ్రి వుంటుంది. పతనమయే ప్రమాదం ప్రతి క్షణమూ వుంటుంది. సాధకుడు ఎప్పుడూ సావధానంగా (జాగ్రత్తగా, మెలకువగా) వుండాలి. ఎందుకంటే, అతను చెయ్యవలసింది అవరోహణం (దిగడం) కాదు, ఆరోహణం (ఎక్కడం). మృత్యుంజయత్వమైన వీరత్వంతో జీవనాన్ని ఐశ్వర్యశీలిగా చెయ్యడమే తాంత్రికుడి పురుషార్ధమవుతుంది.
శ్రీ రామకృష్ణ పరమహంస పగలు దక్షిణాచార పద్ధతిలో, రాత్రి పూట వామాచార పద్ధతిలో కాళీ సాధన చేసేవారట

ఇంకో పద్ధతిలో కృత్రిమంగా ఊర్ధ్వరేతాన్ని సాధించవచ్చు. గంజాయి లాంటి పదార్ధాన్ని సేవించినప్పుడు రేతస్సు తాత్కాలికంగా ఊర్ధ్వగతి చెందుతుంది. అప్పుడు దాన్ని స్థంభింపజేయగలిగితే సమాధిస్థితి సాధించుతారు. బైరాగులు, సాధువులు గంజాయి సేవించటంలోని అంతరార్ధమిదే.

86

లోకమంతయు ఏకంబుగా జేసి
ఏకుపట్టెడువాడు వచ్చీనిమా
ప్రాకటంబుగాను లోకంబులో తాను
మేకై నిలిచి జనుల మేలెంచునుమా
--------------------

ఈ గోవిందవాక్యము గాంధీ గురించి అనుకుంటారు కానీ కాదు. ఎలాగో చూడండి.

ఇతగాడి ఆధ్వర్యంలో లోకమంతా ఏకం కావటం సంగతి దేవుడెరుగు హిందూ ముస్లింలను ఏకం చేయలేక పోగా భారత్, పాకిస్తాన్ విడిపోవడానికి ముఖ్యకారకుడయ్యాడు. ఈ సత్యసంధుడి మాటలు ముస్లింలు పాటించిన దాఖలాలు లేవు. తన దేహం ముక్కలైన తరువాతనే భారతదేశం ముక్కలౌతుంది అని పలికిన ఈ సత్యసంధుడి 'భీషణ' ప్రతిజ్ఞ ఏమైందో తెలిసిందే. విభజన అనివార్యమైతే ముస్లింలనందర్నీ పాకిస్తాన్ పంపుదామని డా.బీ.ఆర్.అంబేద్కర్, పటేల్ తదితరులు చెప్పిన మాటలు ఏ మాత్రం పట్టించుకోలేదు. ఇతడి కీర్తికండూతి, మూర్ఖత్వం, ప్రయోగాల దుష్ఫలితాలు తరాలుగా భారతదేశ ప్రజలు మరీ ముఖ్యంగా హిందువులు అనుభవిస్తూనే వున్నారు. ఇతడు భరతమాత గుండెల్లో 'మేకు' మాత్రమే. 'జాతిపిత' అనుకుందామనుకుంటే ఇతగాడి వారసుల గురించి గుర్తుతెచ్చుకొండి. ఒక

(నరహంతక) వారసుడి ఆధ్వర్యంలో ఢిల్లీ నడిబొడ్డున సిక్కుల్ని ఊచకోత కోస్తే ఈనాటికీ ఆ హంతకులకు సరైన శిక్ష పడలేదు, ఒక వారసుడు తనకు సీటు రాలేదని గాంధీభవన్ ధ్వంసంచేస్తాడు. ఇంకొడు బస్సులు తగలబెట్టిస్తాడు. ప్రతిపక్షపార్టీ వాళ్ళ ఆస్తులు ధ్వంసం చేయిస్తాడు. ఈ 'పిత' వారసులు, అనుచరులు వాళ్ళ దౌష్ట్యాలూ తెలిసిన విషయమే.

సత్యము, అహింస తన ఆయుధాలంటాడు గాంధి.

"సత్య ప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్" :: సత్యంలో నెలకొని యుండటంవల్ల యోగి (తనకొరకూ ఇతరుల కొరకూకూడా) కర్మలను చేయకుండానే కర్మఫలాలను పొందే శక్తి సంపన్నుడౌతాడు. సత్యశక్తి నీలో నెలకొని వుంటే, కలలో కూడ నువ్వు కల్లలాడవు; మనోవాక్కాయ కర్మల్లో సత్యవంతుడవై ఉంటావు. నువ్వేమన్నా అది సత్యమై తీరుతుంది. 'ధన్యుడివికా' అని ఒకరియడల నువ్వంటే, ఆ వ్యక్తి ధన్యుడౌతాడు. రోగిని చూచి, 'నీ కారోగ్యం కలగనీ' అంటే చాలు, అతను స్వస్థుడౌతాడు.

అహింసా ప్రతిష్ఠాయాం తత్ సన్నిధౌ వైరత్యాగ: (అహింసలో నెలకొనియున్నవాని సాన్నిధ్యంలో (ఇతరుల) వైరాలు తొలగిపోతాయి. అహింసాధర్మంలో సుస్థిరంగా వుండే వాని సాన్నిధ్యంలో,స్వభావంతో క్రూరమైన సింహ వ్యాఘ్రాది జంతువులు కూడా శాంతం కలిగి వర్తిస్తాయి. అలాంటి యోగి ఎదుట పులి, మేకపిల్ల కలసి ఆడుకుంటాయి. ఈ స్థితిని పొందినప్పుడు మాత్రమే యోగి అహింసలో సుస్థిరుడని గ్రహించాలి

మూర్తీభవించిన పరమ అహింసా స్వరూపముగా పేరుగాంచిన ఈ వ్యక్తి, పట్టాభి గెలుపు ఓటములు తనవేనని ప్రకటించి ఆ తరువాత పట్టాభి ఓడి నేతాజీ సుభాష్ చంద్రబోస్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు కావటం జీర్ణించు కోలేక నేతాజీని ఎంత హింస పెట్టాడో అందరికీ తెలిసిన విషయమే. అలాగే, ఈయన పరమ అహింసా స్వరూపమైతే ఈయన సాన్నిధ్యంలో ఎవరూ పరస్పర వైరంతో వుండగూడదు. అలాంటిది ఈ పరమ అహింసా మూర్తిమీదే నాథూరాం వినాయక్ గాడ్సే తుపాకీ గురిపెట్టి ఎలా కాల్చగలిగాడు?

(ఆత్మనిగ్రహం పేరుతో గాంధీ చేసిన ప్రయోగాలకు బలైన ఆడవాళ్ళు ఎందరో(ముఖ్యంగా సబర్మతీ ఆశ్రమంలో).)

87.
గుగ్గిళ్ళరాయుడు ఏలూరు ఏనుగుచేత చచ్చీని.

88.
తిరుపతి వేంకటేశ్వరుని గుడిలో మ్లేఛ్ఛులు ఆడిపాడీరు. కపిధ్వజం కదిలీని. ఘం అనే శబ్దము పుట్టీని. నానా దిక్కులకు పంపులు ఎగిసి ఆడీని.

89.
ఊరూరా బెబ్బులులు మనుష్యుల కరచి చంపీని.

90.
దుర్గస్థలాలకు తుఱకలు పాఠి గొట్టెలై యుండేను.

91.
లంకమల రామేశుని రాక నిజమయ్యీని.

92.
సోమశిలగండి కనుమ మార్గాననే దుర్గాధిపతి దురితభంజనుడై ధూర్జటి పర్యాయనామ సంవత్సర, ద్విగుణకాలాంతర త్రయీమాసాన, భాసురభానువారాన పంచాక్షర ప్రకాశ ప్రళయ నక్షత్ర, దక్షిణకాలానను, పక్షద్వయాన, ప్రవేశ మయ్యీని, బంగారు జంగమయ్య లింగాగ్ని ప్రజ్వరిల్లీని. లీలావతారంబులు లీనమయ్యీని. అంగాంగాలు హరించీని. ఆర్తజనానందమయ్యీని. అంబుజసంభవుని వ్రాత అంతమయ్యీని. అధిక తేజ: పరమేష్ఠి ప్రకాశ పరమనదీ ప్రాంత పట్టణ ప్రవేశమయ్యీని.

117

118

119

120

శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి గారితో పాటు ఇంకా నలుగురు కూడా కాలజ్ఞానమును రచించినారు. వారు (1) శ్రీ ఈశ్వరీ మహాదేవి (బ్రహ్మంగారి మనుమరాలు), కందిమల్లాయపల్లెలో జీవసమాధిలో ఉన్నారు, (2) శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారు (పాలకొండ, శ్రీకాకుళం జిల్లా) (ప్రస్తుతం శ్రీశైలంలో ఉన్నారు), (3) శ్రీ స్వర్ణ అమరలింగేశ్వరస్వామివారు (ముప్పవరం, ప్రకాశం జిల్లా) (ప్రస్తుతం శ్రీశైలంలో ఉన్నారు). (4) శ్రీ శరభేశ్వరస్వామివారు (కర్నాటక) ప్రస్తుతం ఉదయగిరి(నెల్లూరుజిల్లా),వద్ద ఉన్నారు.

శ్రీశైలంలో నా గురుదేవుల వద్ద వున్న బ్రహ్మంగారి కాలజ్ఞాన తాళప్రతులు స్కాన్ చేసినవి ఈ క్రింద పొందుపరుస్తున్నాను. అలాగే శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి, శ్రీ స్వర్ణ అమరలింగేశ్వర స్వామి వార్ల కాలజ్ఞాన తాళప్రతులు కూడా.

tp0001



tp0002



tp0003



tp0004



tp0005



tp0006



tp0007



tp0008



tp0009



tp0010



tp0011



tp0012



tp0013



tp0014



tp0015



tp0016



tp0017



tp0018



tp0019



tp0020

కల్కిస్తుత పరమశివ స్తోత్రము

1) గౌరీనాథం విశ్వనాథం శరణ్యభూతావాసం వాసుకీ కంఠభూషం త్ర్యక్షం పంచాస్యాదిదేవం పురాణవందే సాన్ద్రానంద సందోహదక్షం.
2) యోగాధీశం కామనాశం కరాళగంగా తరంగాక్లిన్న మూర్ధానమీశం జటాజూటాటోపరిభిత్పభావం మహాకాలం చన్ద్రభాలం నమామి
3)స్మశానస్థం భూతవేతాలసం నానాశస్త్రై: ఖందశూలాదిభిశ్చ వ్యాగ్రాతుగ్రా బాహవో లోకనాశో యశ్య క్రోధోద్ధూత లోకోత్మేతి
4) యో భూతాధి: పంచభూతై సిస్రుక్షు: తన్మాత్రత్మా కాలకర్మ స్వభావై: ప్రహృత్యేదం ప్రాప్య జీవత్వమీశో బ్రహ్మానందో రమతే తం నమామి
5) స్థితో విష్ణు: సర్వజిష్ణు: సురాత్మా లోకాన్ ధాధూన ధర్మసేతూన్ విభర్తి బ్రహ్మాద్యాంశే యోఽభిమానీ గుణాత్మా శబ్దాద్యం గేస్తపరేశ నమామి
6) యజ్ఞస్యా వాయవో వాంతిలోకే జ్వలత్యాగ్ని: సవితా యాతి తప్యన్ శీతాంశు ఖేతారకై: సంగ్రహశ్చై ప్రవర్తతే తం పరేశం ప్రపద్యే
7) యస్యాశ్చాసాత్ సర్వధాత్రీ ధరిత్రీ దేవో వర్షత్యమ్బుకాల: ప్రమాతా మేరుర్మధ్యే భువనానాంచ భర్తా తమశాన విశ్వరూపం నమామి.

శ్రీ వీరభోగవసంతరాయలవారు ఈ స్తోత్రము పఠించే పరమశివుడిని మెప్పించి, స్వామివారి కృపకు పాత్రులై వారినుండి ఆశీస్సులు, పాశుపతాదులను పొందారు. ఎవరైతే ఈ స్తోత్రము భక్తితో పఠిస్తారో, వారికి బాధలనుండి విముక్తి లభించి సుఖశాంతులు పొందగలరని పరమశివుడు శ్రీ వీరభోగవసంతరాయలవారికి అభయమిచ్చారు.

శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వామివారి మన్త్రము

ఓం హ్రీం శ్రీం ఐం క్లీం సౌ: సౌ: క్లీం ఐం శ్రీం హ్రీం ఓం శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామినే నమ:

శ్రీశ్రీశ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామివారి మన్త్రము

ఓం హ్రీం క్లీం శ్రీం శివాయ బ్రహ్మణే నమ:

శ్రీశ్రీశ్రీ ఈశ్వరీ మహాదేవి మన్త్రము

ఓం ఐం హ్రీం క్లీం శ్రీం శ్రీ ఈశ్వరీదేవినే నమ:

శ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారు పఠించిన శ్రీ వీరభద్రస్వామి ఖడ్గము

ఓం నమోభగవతే అధర్వణ మహాశాస్త్ర మహామంత్రాధికారిణే! శ్రీంహ్రీంక్లీం కాత్యాయనీ కుమార! క్లీంక్లీం శరభావతార హ్రాం ఆదిమశూర! ఝుంకార! ప్రళయరుద్రాకార! క్షంక్షాం సప్తకోటి మహామంత్రాధికార! ఓం నమో వీరాయ నీ భూతికేలంబూని నొసటన్ ధరింప, భుక్తిముక్తి ప్రదంబులౌ కామిని, మోహిని, ఢాకిని, భూతప్రేతపిశాచ బ్రహ్మరాక్షస, మారీగణ, యక్షిణీ గ్రహంబులున్ మొదలగు శల్యతంతు, శరతంతు, శాపరతంతు, జంబూకతంతు, రోమతంతు, సర్పతంతు, సర్వ వ్యాఘ్ర భల్లూకాది మంత్రయంత్ర తంత్రజ్ఞులకున్ నోళ్ళాడక కాళ్ళాడక ఊరకంజూతురు బాలగ్రహ, నేలగ్రహ, దివసగ్రహ, వారగ్రహ, పక్షగ్రహ, మాసగ్రహ, ఋతుగ్రహ, ఆయనగ్రహ, అబ్దగ్రహ, క్రూరగ్రహ, కృకరగ్రహ, చండీగ్రహ, ముండీగ్రహ, యక్షిణీగ్రహాదులన్ నిలువంజాలక నీకు మ్రొక్కులిడి వటద్వీపంబునకుంజను శంభుని వరపుత్ర అతిపరాక్ర విక్రమ సర్వదేవతాగర్వ భంజన! పాహిమాం శ్రీపోతులూరి పురనివాస భూతిభాస భూతనాశ రిపుగణదోర్బలధ్వంస శ్రీమహోద్దండ వీరభద్ర! నమస్తే నమస్తే నమ:

దీనిని పఠించి తీర్థ ప్రాసాదములుగాని, విభూతిగాని ఇచ్చినచో సమస్త పీడలు, ప్రయోగ దోషములు, తొక్కిడివలన వచ్చిన గ్రహ దోషములు మొదలగు సమస్త విధ దోషములు పరిహారమగును.

నా, నా కుటుంబం, స్నేహితులు, శిష్యుల అనుభవాలు
------------------------------------------------------

1999 సంవత్సరములో శ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి వారు, చీరాలలో యున్న మా స్వగృహమునకు సశరీరముతో వచ్చి, నా తల్లిదండ్రులైన బ్రహ్మశ్రీ పావులూరి లక్ష్మీనరసింహారావు, శ్రీమతి చాముండేశ్వరీదేవి లకు దర్శనమిచ్చి ఆశీర్వదించటం వారికి కలిగిన ప్రత్యక్షానుభవము. మరియూ, గురుప్రసాదితమై నాకు లభించిన కొన్ని అమూల్యమైన వస్తువులు, నేను ఊరిలో లేనప్పుడు తమ సంరక్షణలో ఉంచుకున్న నా సోదరులైన కీ.శే. పావులూరి నాగేశ్వరరావు, బ్రహ్మశ్రీ పావులూరి వీరబ్రహ్మజీరావు గార్లకు కొన్ని విచిత్రానుభూతులు కలిగినవి.

గురుదేవులతోపాటు, శ్రీ వీరభోగవసంతరాయలవారు సూక్ష్మశరీరులై మావద్దకు వచ్చినప్పుడు కలిగే అనుభూతి, దివ్యపరిమళము నా కుటుంబసభ్యులకే కాక ఇతరులకు కూడా చిరపరిచితమే. వారిలో ముఖ్యులు, శ్రీ వై.వీ.రావు, శ్రీ చలసాని హేమంతరావుచౌదరి, శ్రీ నవీన్, బ్రహ్మశ్రీ సతీష్, తదితరులు.

నేను నిర్ణయించిన ఒక ముహూర్తమునకు, పోలేరమ్మవారి గుడికి వెళ్ళి, అమ్మవారికి నైవేద్యము పెట్టినతర్వాత, అమ్మవారు తన ఉనికిని తెలియచేస్తూ నైవేద్యమును స్వీకరించి, చూపిన నిదర్శనమును చూచినవారిలో ముఖ్యులు శ్రీశ్రీశ్రీ శివకుమారస్వామిగారు, మఠాధిపతి, శ్రీఈశ్వరీదేవిమఠము; బ్రహ్మశ్రీ వీరయ్యస్వామిగారు; బ్రహ్మశ్రీ సంపత్; బ్రహ్మశ్రీ కల్యాణ్, బ్రహ్మశ్రీ కనగాల సతీష్, బ్రహ్మశ్రీ చంద్ర, శ్రీ అంజి - శ్రీ ఈశ్వరీదేవి మఠం, కందిమల్లాయపల్లె.

ఈ పుస్తకమును (కొన్ని సంచికలు) ముద్రణచేసి, ఉచితముగా పంపిణీ చేసిన శ్రీ దగ్గుమాటి నరేంద్రబాబు గారికి (2010 లో) బ్రహ్మంగారి మనుమరాలైన శ్రీ ఈశ్వరీ మహాదేవి దర్శనమిచ్చారు.

నేను నిర్ణయించిన వేరే ఒక ముహూర్తమునకు మాచర్ల లోని చెన్నకేశవ స్వామి దేవాలయమునకు వెళ్ళి శ్రీ దత్తాత్రేయులవారిని సశరీరముగా దర్శించుకున్నాడు నా మిత్రుడూ, శిష్యుడు, హైదరాబాదు లోని ఒక ప్రముఖ కాలేజీ వైస్ ప్రిన్సిపాల్ అయిన శ్రీ పుట్టు వెంకట సాంబశివరావు గారు. (దురదృష్టవశాత్తు అక్కడే వున్న శ్రీ వీరభోగ వసంతరాయలవారిని గుర్తు పట్టలేకపోయినాడు)

తేది.15.04.2012 ఉదయము గం.6.10 ని.లకు శ్రీ వీరభోగసంతరాయలవారు సశరీరముతో అశ్వారూఢులై శ్రీ గాయత్రీవిశ్వకర్మ దేవాలయ ప్రతిష్ఠా ప్రాంగణము వద్దకు వచ్చి క్షణకాలముండి వెళ్ళినప్పుడు నాతోపాటు కొందరికి దర్శన భాగ్యము కలిగినది. నాకు(పావులూరి శ్రీనివాసాచారి(పాఞ్చజన్య విశ్వకర్మ)), శ్వేతవర్ణముతో యున్న అశ్వము(దేవదత్త) మీద శ్రీ వీరభోగవసంతరాయల వారు దర్శనమీయగా, కొందరికి గుఱ్ఱము మాత్రమే కనుపించినది (కొందరికి శ్వేత వర్ణముతో, కొందరికి గోధుమ వర్ణముతో). (అలా చూసిన వారిలో ముఖ్యులు శ్రీ మసిముక్కు రమేశ్(రవి),ప్రొద్దుటూరు, బ్రహ్మశ్రీ మందరపు రవిప్రసాద్(ఒంగోలు)). ఆ తరువాత, విగ్రహ ప్రతిష్ఠా సమయమున శ్రీ వీరభోగవసంతరాయలవారు వారి గురుదేవులతో వచ్చి కొలది సమయముండి వెళ్ళినారు. విగ్రహ ప్రతిష్ఠా సమయమందు ఆఱు గరుడ పక్షులు ఆకాశంలో ప్రదక్షిణ చేయటము అందరూ చూచినారు.

వేరొక సందర్భంలో, నా శిష్యుడైన శ్రీ బండారు గిరిధర్(ఆదోని), శ్రీశైలములోని శ్రీ బయలువీరభద్రస్వామి వారికి పూజచేసి, నైవేద్యం సమర్పించి, కడియము స్వామివారి పాదాల వద్దనుంచి ధరించవలెననుకొనగా, శ్రీ బయలు వీరభద్రస్వామివారు తాను స్వయంగా ఆ కడియమును ధరించి తిరిగి అతనికి ప్రసాదించటం శ్రీ బండారు గిరిధరుకు కలిగిన ప్రత్యక్ష దైవానుభవము.

తేది.15.04.2012న శ్రీ గాయత్రివిశ్వకర్మ దేవాలయ ప్రతిష్ట కార్యక్రమ సమయంలో, శ్రీమతి పావులూరి లక్ష్మీరాజ్యం శ్రీనివాసాచారి హోమము చేసేప్పుడు, కుంకుమార్చన చేసిన సమయంలో ఫోటోలు తీయగా కనుపించిన గరుడపక్షి, హనుమ, అమ్మవారి రూపములు





నేను పూజ చేసేప్పుడు కనిపించిన కాలభైరవ స్వరూపము

చివరిగా
ఈ సభ్యసమాజంనుండి శాశ్వతంగా సెలవు తీసుకొని నా గురుదేవుల వద్దకు వెళ్ళబోయేముందు కొన్ని విషయాలు తెలియచేయాలనుకుంటున్నాను

జూన్, 1991 లో బ్రహ్మంగారి, నా గురుదేవులైన శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరులవారి, శ్రీశ్రీశ్రీ స్వర్ణ ఆమరలింగేశ్వర స్వామివార్లచే రచించబడ్డ కాలజ్ఞానము చూడడం తటస్థించింది.

అవి చదివిన తరువాత నా గురుదేవులను 'ఈ ప్రళయాల్ని' ఆపలేమా, కనీసం వాటి తీవ్రత తగ్గించలేమా అని అడిగాను.

సశేషం